# విషయసూచిక

—— o:——





# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

విద్యావిషయిక మాసపత్రిక

సంపుటము 40] ఏలూరు, 15 జనవరి [సంచిక 10





**వివరణము :**

ప్రపంచజ్ఞానమునకన్న ఉన్నతమగునది మఱొకశక్తి గలదు. ఆ యున్నత భావ ప్రపంచము దేనికన్న వేఱైనదిమాత్రము గాదు. దానిని ఇచటనే చూడవచ్చును. ఇపుడే చూడవచ్చునుగూడ. సరియగు ద్వారమును తెలియక మనము వానిని జూడఁ జాలకున్నాము. ఈ పరిమిత ప్రపంచములో నిత్యమగు శాంతిసౌఖ్యములఁ బొందిన వా డొక్కఁడును లేడు. అంతరంగమునఁ గనుగొనినవారు పిమ్మట బయటనుగూడ చూడ గలరు. ఉన్నతసౌఖ్యము లభించునపుడు నీచసౌఖ్యమును విడనాడుదుము.

**సంకీర్తనము :**

హే అనంతసౌఖ్యప్రదాతా! నా హృదయమునకు దివ్యానంద మొసంగుము.
నా చిత్తమున నెట్టి నీచభావములను జొఱనీకుము.
నా హృదయ మెప్పుడును నీవు నిలచుటకు తగినవేదిక యగుఁగాక!

**స్వామి రామతీర్థ.**




బాలకవి. కోట సీతారామమూర్తి – కౌతులపూడి.

(బాలరాజు సినిమాలోని "తీయని వెన్నెలరేయి" అనుపాట వరుస)

1. పోదము రండోయ్ ! మనము
నవప్రాథమిక బడికే దినము
ఓ బాల బాలికలూ
చదువునే... నేర్చుకొనీ
సుఖమునే... పొందుటకై ॥పోదము॥

2. దివ్యదీక్షతోడ... మనమేగే బడులలో...
చదువెంతో శ్రద్ధతో... నేర్వాలి మనమంతా ॥చదు॥

3. కీర్తిగాంచ భువిలో... బడిలో...
చదువునేర్చి... జ్ఞానవంతులమై...
జగదేకవీరులమై
జగతిలో... మనమంతా
జయమునే గాంచుటకై ॥పోదము॥

---

## ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

మాచే ప్రచురింపబడు "ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య" మాసపత్రికలో అడ్వరుటైజుమెంటు చేయువారికి యీ క్రింద ఉదహరించిన రేట్ల ప్రకారం అడ్వరుటైజుమెంటు చేయబడును. వలయువారు పేజీకి ఒకవైపున విపులముగ సిరాతో వ్రాసి మా యీ దిగువ అడ్రసుకు అడ్వరుటైజుమెంటు రేట్ల ప్రకారము, సొమ్ముతోసహా పంపగోరుచున్నాము.

అడ్వరుటైజుమెంటు రేట్లు

| | పూర్తిపేజి | అర్ధపేజి | పావుపేజి |
|---|---|---|---|
| 1 నెలకు | 10—0—0 | 6—0—0 | 4—0—0 |
| 3 ,, | 25—0—0 | 16—0—0 | 10—0—0 |
| 6 ,, | 45—0—0 | 25—0—0 | 18—0—0 |
| 1 సం॥రమునకు | 80—0—0 | 48—0—0 | 30—0—0 |

ఇట్లు,

**రామా అండ్ కో., ఏలూరు.**

పశ్చిమగోదావరిజిల్లా,

# వయోజన మనస్తత్వము

## — బోధకుల కర్తవ్యము —

—శీలా వెంకటప్ప - కమలాపురం

విద్యాబోధనాక్రమములో మనస్తత్వశాస్త్రము అతిముఖ్యమైన స్థానమును ఆక్రమించియున్నదనే సత్యాన్ని విద్యావేత్తలెల్లరు యెరిగినదే మానవుని యొక్క మానసిక ప్రవృత్తులు, పోకడలు, అభిరుచులు, భావములు, మున్నగువానినిగూర్చి వివరించునదే మనస్తత్వశాస్త్రము. మానవుని లోనున్న స్మరణశక్తి, హేతువాదశక్తి, ఆలోచనాశక్తి, కల్పనాశక్తి, అభిరుచి, శ్రద్ధ, అవధానము మొదలగు శక్తులను వివరించడమే ఈ శాస్త్రముయొక్క లక్ష్యం.

వయోజనవిద్యాబోధకులగు మనం, వయోజనులకు అక్షరాస్యత కలిగించేముందు, వారి మనస్తత్వము నెరిగి, తదనుగుణంగా బోధనగావించి, వ్యవహరించ వలసియున్నది అంతేగాకుండా, మనంకూడ, మన మనస్తత్వాన్నిగూర్చి తెలిసికోవడం మరీముఖ్యం. మనం యెంత సుశిక్షితబోధకులమైనా, పండితోత్తములమైనా, పెద్దల మనస్తత్వాన్నిగూర్చి తెలిసికోకుండా బోధించడం మనబోధన వ్యర్థంకావడంతప్ప మరేమీ ప్రయోజనం వుండదు మన వయోజన కేంద్రాలకు హాజరయ్యేపెద్దలు ఇంతో, అంతో, అనుభవముతో కూడుకొని వచ్చేవారేగాని, ఒకటి రెండు క్లాసుల్లోవుండే పసిపిల్లలమాదిరి అప్పుడే లోకములో ప్రవేశించినవారుకారు. ఈ లోకంలో అప్పుడే కొద్దిగనో, గొప్పగనో, జవాబుదారికి బాధ్యులైనవారు మన పెద్దలు. మనకేంద్రాల్లో అటువంటివారితో అనుదినం కలిసిమెలిసివుంటున్నప్పుడు మనం వారి అలవాట్లను, చర్యలను, పరిశీలిస్తూ, సక్రమమార్గాన వినియోగించుకోవడం చాలా అవసరం.

మనకేంద్రాలకు హాజరయ్యేవయోజనులు సామాన్యముగా 14 సం॥ లకు పైబడివుంటారు. వారి భావాలు, చర్యలు, చాలమట్టుకు పిల్లలచేష్టలకు భిన్నంగావుంటాయి. అయితే పక్వమైనదశలో వుంటాయి. అనుభవజ్ఞులుగాన సమయసందర్భాలను గ్రూపువారిగా విభజించుకొనేశక్తి, మిక్కుటముగా వుంటుంది అంటే ఆలోచించేశక్తిఅన్నమాట. వీరి ఆలోచనలు, కార్యాలు, స్థిరరూపంలో వుంటాయి. అక్షరాస్యత లేనంతమాత్రాన వయోజనుల కార్యాలు, ఆలోచనలు, మనంతృణీకరించక, పాఠ్య బోధనాక్రమములో వినియోగించుకొంటే, మన ప్రచారకార్యక్రమం దివ్యంగా సాగుతుంది ఏదో విధంగా అతని ఆలోచనలను భగ్నంచేయవలెనని తలంచితే, అతనిలోవుండే ప్రతాపశక్తులు మనకెదురౌతవి మన కార్యక్రమం కొనసాగదు.

వయోజనులు అనుభవములో ఒక్కొక్కప్పుడు మనకంటె గొప్పవారుగా వుండవచ్చును. "వారి జీవితమే ఒక శిక్షణ" అనికూడ మనం ఆలోచించితే బోధపడుతుంది. ఉదయంలేచిందిమొదలు అస్తమానంవరకు చెమటోడ్చి, కుటుంబభారాన్ని మోయుటచేతను, సంఘవ్యవస్థలో భాగస్వాములై యుండుటవలనను, వారికి మనమిచ్చే శిక్షణ (చదువను, వ్రాయును) చాల గొప్పదని తలంచడం-లేదా భ్రమపడటం-చాలా పొరపాటే కాగలదు. వారి దినచర్యల్లో అనుదినం సంఘటిత మయ్యేధ్వనులకు, శబ్దములకు-మనమిచ్చే శిక్షణే చదవడం వ్రాయడం అంతేగాని మరేమికాదు. మన కేంద్రాలకు రకరకాల వారు హాజరైనపుడు, అందులో ఒక నేతపనివాని మగ్గమునో-లేక మరేమయినా వస్తువునో అతనిసమక్షములోనుంచి, దానివిషయమై మనం ప్రశ్నించినపుడు వారికి అనేకవిధములగు భావపరంపరలు మనోవీధిలో పుట్టుకొస్తాయి లేదా ప్రతిబింబిస్తాయి. మగ్గమువీద వేసేపడుగు, పేకనూలు, నాడి అటునిటుపోతూ అల్లిక అల్లడం, అయిన వెంటనే తిరిగి అతకడం, మొదలుగాగల భావసముదాయమును గుర్తించి, బోధకులు ఆభావములను సంధానము చేయడం అత్యవసరం

ఎప్పుడైతే మనం ఈభావముల యేకీకరణకు పూనుకొంటామో, వయోజనుల శ్రద్ధాశక్తులు ఔచిత్య

ముతో పురికొల్పబడుతవి మనం సర్వవిషయాలతో పైవిషయాలనుచేర్చి, బోధించినపుడే మన బోధన సుబోధనకాగలదు. పరిపూర్ణతఁజెందగలదు

అస్తమానం కాయకష్టంచేసి కేంద్రాలకు వచ్చిన పెద్దల మనస్తత్వము చాలా చికాకుగా వుండవచ్చును. విసుగుతో వుండవచ్చును విసుగును పోగొట్టుటకు వారిపనిలోని భావకోటిని వివేకం కోసం, కౌశల్యము కోసం, మనం వినియోగించుకొంటే వారిని ఆనంద మయులుగా చేయవచ్చును. ఉదాహరణకు -వడ్రంగి చేతిపనిలోని కౌశల్యమునో, నేతగాని ప్రావీణ్యమునో, శిల్పిచాతుర్యమునో, ప్రస్తావించి, అందుకనువగు పదజాలమునో, వాక్యసముదాయమునో, కలిగించి, అక్షరాస్యతా బోధనము చేయవచ్చును అయితే ఇది ఆచరణలో మాత్రం కష్టసాధ్యంగా తోస్తుంది-అవి మన స్తత్వవేత్తల అభిప్రాయం.

వయోజనులలో హేతువాదశక్తి బలీయంగా వుంటుంది పసిపిల్లలకంటె యెక్కువగా ఈశక్తితో కార్యకారణములకు గల సంబంధసామ్యమును, ఆలోచించి నిర్ణయించుకొనే శక్తితో ఫలితాన్ని సాధిస్తారు కాన వయోజనులకు అక్షరాస్యత కలిగించేముందు, బోధకులు యేవిధమైన విరుద్ధభావాల్ని వీరి మనస్సులలో కలుగకుండా, జాగ్రత్తతో మెలగడం అత్యావసరం అప్పుడే మనబోధన సక్రమంగాను, నిర్దుష్టముగాను, జరిగిపోతుంది.

సాధారణముగా వయోజనులందు నాయకత్వ గుణం ప్రస్ఫుటిస్తూ వుంటుంది ఈగుణంతో ఇతరులకంటే తానే అధికుడనియు, అధికారం చెలాయించేందుకు, నాయకత్వం వహించేందుకు ప్రయత్నించడం జరుగుతూ వుంటుంది. తుదకు తమ యింటియందైనా అధిక్యత సంపాదించేందుకు వుద్యమిస్తూ వుంటారు. బోధకులగు మనం, మన కార్య నిర్వహణలో ఈగుణాన్ని వుపయోగించుకుంటే బాగుంటుంది కేంద్రముల సక్రమపంథాలో వుంచుకోవడములోను, ఒకరు మరొకరికి బోధించే సూత్రం ప్రకారం ఇటువంటివారిని నియమించుకోవడములోను, వీరిని తమ ప్రజ్ఞాప్రాభవాలతో వశపరచుకోవడం మంచిది. అవసరంకొద్దీ కొంత జవాబుదారీతో కూడుకొన్న కార్యక్రమాన్ని యిచ్చి, సంఘసేవకు, దేశసేవకు, అనుగుణంగా తయారు చేసుకోవడం కూడ చాల శ్రేయస్కరం.

పెద్దలలో చదువుకొనేందుకు ఎక్కువ అభిలాష వుంటుంది అయితే ఈఅభిలాష భయము, కించిత్ జ్ఞత, నిస్పృహ, మున్నగు భావములచే కప్పబడి వుంటుంది ఉపాధ్యాయులగు మనం వుత్సాహంతో కూడుకొన్న విషయాలు, దేశనాయకులను గూర్చిన కథలు, విజ్ఞానవిషయాలు, బోధించి వారి అభిలాషను ద్విగుణీకృతం చేయడం మంచిది

లోకంలో సుప్రసిద్ధులైన గాంధి, నెహ్రూ చర్చిల్, బెర్నార్డ్‌షా, మున్నగు ప్రభృతుల జీవిత చరిత్రలు సేకరించి, బోధించడం మరీ ముఖ్యం. వీరిలో వుండే కించిత్ జ్ఞత ఒక్కొక్కతూరి అనేక వక్రమార్గాలకు వీరిని పురికొల్పుతుంది పదిమందిలో సహితంకూర్చొని చదివేందుకు వెనుదీస్తారు. పంతుళ్ల హుంకరింపులకు, బెదరింపులకు, యెందుకు లొంగాలి అని వెనుదీయవచ్చును. కాన ఇటువంటివారిని చిన్నపిల్లలున్నయెడల వీరిలో నుంచక గౌరవ, మర్యాదలతో ప్రతిసందర్భములోను పరిశీలిస్తూ యుండవలెను వారు తప్పులేమైనా చేస్తూ వుంటే చూచి చూడనట్లు గమనిస్తూ వారికేమాత్రం కష్టంకలిగించక ప్రవర్తించవలెను. లేనియెడల వయోజన విద్యా ప్రచారానికే వ్యాఘాతం యేర్పడవచ్చును.

మన వయోజన పాఠశాలలకు హాజరయ్యే వయోజనులు యేరకమునకుఁజెందినవారో తెలిసికొనుట చాలా అవసరము. మన స్తత్వవేత్తలు మానవులను మూడురకముల ప్రవృత్తులవారిగా విభజించినారు.

(1) సత్వగుణులు (2) రజోగుణులు (3) తమోగుణులు సత్వగుణులు మిగతా రెండురకములవారి కంటె శ్రేష్ఠులు. వీరిలక్షణము సంపూర్ణత్యాగము, ధీరత్వము నేడిట్టి గుణములు గల వారిని సభ్యతా ప్రపంచములో అనదల క్రింద-అంటే చేతకాని వారి క్రింద-జమకట్టుతూ యున్నారు ఇట్టి సత్వగుణులను యేపనికైనా పురికొల్పవలయునన్న చాలా కష్టసాధ్యం. అయితే బోధకులలోని మహత్తరమగు ఓర్పు దీక్షలతో సాత్వికులను కార్యోన్ముఖులుగా చేయవచ్చునులే అని దృఢసంకల్పముతో వుండడమే మనవిధి

ద్వితీయవర్గం రజోగుణులు వీరు యేకార్యమైనను సాధించడములో దక్షులు రీవి, దర్పం, వీరి లక్షణాలు వీరిమనః ప్రవృత్తి సమాన స్థాయిలో వుంటుంది వీరితో మనకు అంతకా కష్టంవుండదు. అయితే వీరిని మనం, వినియోగించుకొనడములోనే

కడుజాగరూకులమై యుండవలెను వీరి రీవి, దర్పాలకు న్యూనం కలిగించే మాటలు మాట్లాడకుండా వుండటం శ్రేయస్కరం

తృతీయవర్గం తామస ప్రకృతులు వీరు అహంభావము, ఆగ్రహం, మౌఢ్యం, బడాయి, మొదలగు ప్రతాపశక్తులను కలిగియుంటారు వీరితో తరుచుకొద్ది మాటమాట్లాడిన ఆగ్రహిస్తారు ఈర్ష్యాక్రోధాలను వెళ్లగక్కుతారు కొన వుపాధ్యాయులు వీరిని ప్రేమసౌహార్ద్రములతో తమమార్గమునకు త్రిప్పకొని, చాకచక్యముతో అక్షరాస్యతాప్రచారమునకు దిగవలసియున్నది

తమ వయోజనుల మనస్తత్వమును గురించి తెలిసికొని, బోధకులుగూడ తమ మనఃప్రవృత్తులను తెలిసికొని, సరిదిద్దుకొని, వారికి ఆదర్శప్రాయులుగా వుండటం అతిముఖ్యం మనం త్రైగుణ్యాత్రయంలో (సత్వరజస్తమోగుణములు) యేరకమునకుఁ జెందినవారము ? అయితే మనం సంస్కరించుకొను విధానమేది ? మన ప్రకృతి పరిసరముల ననుసరించి మన ప్రవర్తన సరిదిద్దుకోవలసియున్నది. అప్పుడప్పుడు యితరులపైన చాడీలు చెప్పడం, అలగడం, యీర్ష్యపడటం, యివన్నీ అనుదినం మన జీవయాత్రలో జరుగుతుండే సంఘటనలే మనది ఇటువంటి ప్రవృత్తిగలదిగదాఅని గ్రహించుకొని, మనం మనల్ని సంస్కరించుకోనేందుకు పూనుకోవలయును. దీన్ని సవరించుకోకుండానే మనం నిర్మాణకార్యక్రమం, వయోజనవిద్యా ప్రచారం, దేశసేవ, మొదలగువాటికి పాటుపడటం వ్యర్థభూతమైపోవడంతప్ప ప్రయోజనం వుండదు.

ఇంతకు మనం సత్వరజస్తమోగుణములలో యే రకమునకుఁ జెందినవారమో, ముఖ్యముగా తెలిసికొని, వ్యవహరించడము మరీఅవసరం. మనలోవుండే రీవి, వినయము, మర్యాదలను, చక్కగా వినియోగించుకొంటే, మన కార్యక్రమం నిర్విఘ్నంగా సాగిపోతుంది మన కేంద్రాలకు వచ్చే పెద్దలు కూడ తనంతటివారే అని భావించుకోవడం మంచిది. తన తోటి ప్రజాహితులనుకూడ యెప్పటికైనా, యేనాటికైనా, ప్రజాహిత జీవితానికి, లోక కళ్యాణానికి, తనవైపు త్రిప్పికొంటానులే అనే ధైర్యంతో, ఓపికతో, ఆకాంక్షిస్తూవుండటమే మన ధర్మం. మనమెప్పుడు ఆశావాగులుగానే వుంటూ మన కార్యక్రమాన్ని జరుపుతూవుండాలి. మనం యెంత చురుకుతనం, యెంతగౌరవం, కలిగియుండవలయునో గమనిస్తూ ప్రవర్తించ వలసియున్నది. పెద్దలను ఆకర్షించేవారముగాయుండి, మన బోధన జీవత్వం పుట్టిపచేటట్లుగావుండి, వారియందు దయార్ద్రహృదయులమై వుండవలెను

వయోజన విద్యాబోధకులగు మనం, ప్రేమార్ద్రహృదయులమై, వయోజనుల విశ్వాసాన్ని చూరగొని, వారి జీవితకలాపంలో భాగస్వాములమై సుశిక్షితులుగా, సుపౌరులుగా, వారిని దిద్ది సరిచేయడంలో, మహత్తర కార్యభారాన్ని నిర్వహిస్తున్నట్లు ఆత్మసంతృప్తులమై, విజయభేరిని మోగించవలెనని మిక్కిలి ఆశిస్తూయున్నాను.

## ఉపాధ్యాయలోకం బాగుపడాలంటే....

### ఎన్నికలలో మనకర్తవ్యం...

మన సర్వస్వతంత్ర భారతరాజ్యాంగ చట్టంప్రకారం యిరువైయొక్క సంవత్సరాలు వయస్సుగలిగి, పౌరధర్మాన్ని పాటించే ప్రతిఒక్కరికి ఓటింగ్ హక్కు యేర్పడింది. ఈ చట్టప్రకారం జాతి, మత, కులభేదాలతో అవసరంలేకుండానే, యే వ్యక్తి అయినా సరే, ప్రభుత్వ రథసారథ్యాన్ని వహించేందుకు పూనుకోవచ్చును. ముప్పైఅయిదుకోట్ల జనాభాగల ఈ దేశంలో ఈనాడు కొద్దిగనో, గొప్పగనో, సామాన్యపౌరుడుకూడ తన బాధ్యతను నిర్వహించవలసిన అవసరం యేర్పడింది.

పదునేడుకోట్ల యేబదిలక్షలమంది భారతీయులకు ఈ డిసెంబరు జనవరి ఎన్నికలలో వోటుచేయు అధికారము సంక్రమించింది. బ్రహ్మాండమైన ఈ యెన్నికల సన్నాహము మాదిరి ప్రపంచచరిత్రలో మున్నెన్నడు జరిగియుండలేదు. అప్పుడే లెక్కలేనన్ని పార్టీలు ఆవిర్భవించి ప్రభుత్వ యంత్రాన్ని కైవసము చేసుకొనేందుకు ఎన్నికల ప్రచారంలో హోరాహోరిగ పాల్గొంటున్నాయి. స్వేచ్ఛగాను, న్యాయంగాను, పక్షపాతము లేకుండాను ఎన్నికలు జరిగేందుకు ఇండియా ప్రధాని నెహ్రూపండితుడుకూడ హామీనిస్తూ శీలవంతులు, ప్రతిభావంతులు, ఋజువర్తనులు, నిష్కపటులయిన వారినే యెన్నుకొని, పరిపాలనభారాన్ని వహించమని ఉద్బోధించారు.

రాష్ట్రశాసనసభకు ఉపాధ్యాయుల పక్షమున కొద్దిమంది ప్రతినిధుల నెన్నుకొనుటకు మన ప్రభుత్వము యేర్పాటుచేసినది. అయితే యీ యెన్నికవర్గములందు ఓటరులుగా ప్రాథమికోపాధ్యాయులు పనికిరారని నిషేధించినందున మనలో నిరాశా నిస్పృహలు ఆవరించినవి. మఱియు ఉపాధ్యాయ నియోజకవర్గములందు ఉపాధ్యాయులు కాని వారుకూడ అభ్యర్థులుగా ఎన్నికకావచ్చుననుట మన దౌర్భాగ్యము. దుర్భర పరిస్థితులు చక్కగా తెలిసియుండి శాసనసభలో తెలియజెప్పెడి వుపాధ్యాయులు కాని వారికి మన పరిస్థితులేమి తెలియగలవు?

యేమైన మనదౌర్భాగ్యం కొద్ది రాష్ట్రప్రభుత్వం, భావిజాతీయపౌరులను సృష్టింపగల ప్రాథమికోపాధ్యాయులను విస్మరించడం మన దురదృష్టం. ఉపాధ్యాయ ప్రతినిధివర్గమున ప్రాథమికోపాధ్యాయులకు కూడ, స్థానమిచ్చి ప్రారంభవిద్యా వ్యాప్తికై దోహదం చేయకుండుట విషాదకరం. మన అశ్రద్ధవలన ప్రత్యేక స్థానములకై ఆందోళనచేసియుండకపోవడం ఘోరమైన తప్పిదం చేసినవారమయినాము.

యుద్ధానంతరం గత ఆరేండ్లుగా దుర్భర ఆర్థికదుస్స్థితికిలోనై కృంగి కృశించిపోయినాము. మన కడగండ్ల ప్రవాహం ఇతోధికమై మనమొఱ ఆలకించేనాథుడే దరిచూపులో

లేదు. మనం ఇన్నియేండ్లుగా నిరీక్షిస్తున్న ఎన్నికలు ఈ నాడు సమీపించి మన ఆశల్ని చిగురింప జేస్తున్నాయ్. మన గౌరవహోదాలు, సంఘస్వాతంత్ర్యాలు, అధికవేతనాలు, ప్రాథమికవిద్య, వయోజనవిద్య మున్నగునవి సాధించే సమర్థులు, సత్‌శీలురు, ప్రతిభావంతులు, ఋజువర్తనులు, అయిన అభ్యర్థుల నెన్నుకొన్నచో మన సమస్యలు సులభంగా పరిష్కారం కావచ్చును. అప్పుడే ఉపాధ్యాయలోకంలో విశ్వాసము, సంతృప్తి కలుగుతాయ్ !

—శీలా వెంకటప్ప.

---

## ఉపాధ్యాయులు - శిక్షణ

రచన : యమ్. వేంకట్రావుపట్నాయక్ - వేణమ్మపేట.

విద్యాశాఖలోని ప్రతియుపాధ్యాయునకు శిక్షణ (ట్రయినింగు) పొందుట అత్యావశ్యకము. శిక్షణపొందని యుపాధ్యాయుడు చెల్లనేరదు. నవీనముగా నేర్చినదేదియూ లేకపోయినప్పటికి శిక్షణాలయము ముద్రపడిన యుపాధ్యాయుడు "శంఖములోపోసిన తీర్థమట్లు" విద్యాశాఖలో సముచిత స్థానము నందగలుచున్నాడు. ఎంతటిమేధావియైనను, అనుభవశాలియైనను, శిక్షణ ముద్రవేయించుకొననిదే రాణించలేదు. దీనికి ముఖ్యకారణము విద్యాశాఖాధికార్ల దృష్టి.

శిక్షణపొందిన యుపాధ్యాయుల కొరత ఎంతగలదో యిటీవల దిన, వార, మాసపత్రికలలోని ప్రకటనలే చెప్పుచున్నవి. అన్‌ట్రయిండు టీచర్లు వేలసంఖ్యలోనుందురనిన అతిశయోక్తిగాదు. వీరినందరిని తీసివేసి, ట్రయినింగుపొందిన యుపాధ్యాయులను నియమించవలెనని విద్యాశాఖవారు ఉత్తరువులను జారీచేసియున్నారు. కాని ట్రయిండ్ టీచర్లు ఎక్కడ లభిస్తారు ? ఒకప్పుడు నూటికో కోటికో ఒకరు అక్కడక్కడ యున్నను, తన పొట్టను తాను పోషించుకొనుటకు కూడ చాలని యీ గొర్రెతోక జీతమునకు గ్రామము విడిచి, యింకొకచోటికిపోయి, అచ్చట రాబడిలేని పల్లెపంతులుగా పనిచేయుటకు ఎవరు అంగీకరించివస్తారు ? ఈ విషయము విద్యాశాఖాధికార్లకు తెలిసియుండియు, ప్రకటనచేయు నిమిత్తము బీదమానేజర్లకు రూ 5 లేక రూ 6 లు చొ॥ వెచ్చించమనుట శోచనీయము.

అన్‌ట్రయిండు ఉపాధ్యాయులు ప్రతిరేంజిలోను వందలకొలదిగా నుండుటకు కారణమేమి ? ప్రభుత్వ మమలుజరిపించు విద్యావిధానమే యిందులకు గారణము:—

(1) దరఖాస్తులు పెట్టినవారందరికీ అర్హతలు గలినప్పటికి శిక్షణపొందుటకు ఉత్తరువులు జారీచేయకపోవుట– వీలైనన్ని ఎక్కువ సెంటర్లను తెరచి, అర్హతలనుబట్టి దరఖాస్తుచేసినవారందరికి ట్రయినింగుకు సీటునిచ్చిన, యీ కొరత చాలవరకు తీరగలదు. (2) ట్రయినింగుకాలము 2 సం॥రములు అగుట, స్టయిపెండు (**Stipend**) చాల స్వల్ప

మగుట- తర్ఫీదుకాలపరిమితిని 2 సం॥రములు నుండి ఒక యేడాదికి తగ్గించినచో విద్యా శాఖకును, విద్యార్థులకుగూడ మిక్కిలి సులభమగును. అంతేగాక యిప్పుడు రెండేండ్ల కిచ్చు స్టయిపెండు మొత్తమును ఒక యేడాదిలోనే యిచ్చినచో తర్ఫీదు పాఠశాలలో వెంటనే చేరుటకు ఎక్కువమందికి ఉత్సాహము కలుగును. ధనాభావముచే నేడు పెక్కురు తర్ఫీదుపొందలేకున్నారనుట సర్వజనవిదితమే. (3) ఒకే విద్యాయోగ్యతలు గలిగినవారలకు వివిధ మేనేజిమెంట్లలో వివిధములుగా వేతనము లిచ్చుట- ఈ పద్ధతి మిక్కిలి అన్యాయము. ఇందు గూర్చి ప్రభుత్వమునకు నివేదించినప్పటికి ఎట్టిచర్యను గైకొనకపోవుట అసమంజసము. వేతనములో భేదము లుండుటంబట్టి పలువురు పల్లెలలో పనిచేయుటకు యిష్టపడకున్నారు.

పై మూడు ముఖ్యాంశములను ప్రభుత్వమువారు గుర్తించి- (1) వీలైనన్ని ఎక్కువ ట్రయినింగు పాఠశాలలను తెరచియు, (2) ట్రయినింగుకాలమును 1 సం॥రం చేసియు, స్టయిపెండును వృద్ధిచేసియు, (3) సమాన విద్యాయోగ్యతలు గలవారికి అన్ని మానేజిమెంట్లలోను సమానవేతనము లిచ్చియు నేటి (తర్ఫీదుపొందిన) యుపాధ్యాయుల కొరతను వెంటనే తీర్చి, విద్యాభివృద్ధి గావించ గలందులకు వినయపూర్వకముగా విన్నవించుచున్నాను.

---

# ప్రకటన

కావలెను. కావలెను. కావలెను.

ఈ క్రింద ఉదహరించిన పాఠశాలలలో పనిచేయుటకు హయ్యరుగ్రేడు ట్రయినింగు ప్యాసయిన ఉపాధ్యాయులు కావలెను. వారికి ప్రభుత్వము వారిచ్చు స్కేలు గ్రాంటు - కఱవుబత్తెము - మేనేజరు యివ్వవలసిన రూ. 3-0-0 లు ఇవ్వబడును. ఇందు కంగీకరించి పనిచేయగోరువారు బొబ్బిలి రేంజి సీనియర్ డిప్యూటి ఇన్‌స్పెక్టరు గారికి ఒక అప్లికేషను, సదరు స్కూలు మేనేజరుకు ఒక అప్లికేషను ది 25-1-1952 తేదీలోగా పంపుకోవలెను.

చిరునామాలు .—

1. **వంతరాం సత్యనారాయణ,** మేనేజరు, ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూలు,
× వంతరాం, పెదపెంకి పోష్టు, బొబ్బిలి తాలూకా.

2. **పాచిపెంట సన్యాసిరావు,** మేనేజరు, శ్రీ వేణుగోపాల ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూలు,
× ఆవులకట్ట, పాత్రేరుపోష్టు, బొబ్బిలి తాలూకా

# బేసిక్ విద్య దుష్ప్రచారం

## (సర్వహక్కులు రచయితవి)

కాకరపర్తి కామేశ్వరశాస్త్రి, బేసిక్ టీచరు - ఖండవిల్లి.

బేసిక్ విద్య యనుమాట వినబడుసరికి అది అసహ్యాకరమైన కార్యక్రమములతో కూడినదనియు, దేశమున కేవిధము గాను సహాయకారి కాజాలదనియు విమర్శించువారి సంఖ్య అత్యధికమై యున్నది. దీనిని గూర్చి వివిధవర్గములకు చెందిన విజ్ఞులు చేయు విమర్శనమును విపులముగా వివరించెదను

"బేసిక్ విద్య యనునది భారతీయసంస్కృతిని శిష్టాచారమును, మతసూత్రములను, భగ్నపఱచి, వర్ణసంకర మొనర్చి భ్రష్టుచేయుటకు గాంధీగారు వేసిన యెత్తుగడ" ఇవి ప్రపంచపోకడలను విస్మరించి కేవలము సనాతన ఛాందసనూత్రములను నమ్మియున్న పురాతన బూర్జువా జాతికి చెందిన వ్యక్తిమాటలు

"ప్రపంచమంతా ముందుకుపోతూ, మానవునకు శక్యము కావని యెంచిన పనులను సులభంగాచేస్తూ, సృష్టికి ప్రతిసృష్టిని మానవుడు నిర్మింపగల్గుచున్న యీనవనాగరిక ప్రపంచంలో పురాతనపనులపై విద్య నేర్పుట యెన్నో అంతస్తులు దేశాన్ని క్రిందికి తీసుకు పోవడమే ఔతుంది ఇది యేమాత్రము అభివృద్ధి నందజాలదు ఇది విదేశీయ నాగరికతా వ్యామోహాంధకారముచే భారతీయసంస్కృతిని అవగతంచేసుకొనలేని యొక నవనాగరికుని అభిప్రాయము

"ఈ విద్యావిధానములో అన్నియు బాగుగనే యున్నవి; కాని వర్ణవివక్షత లేకపోవుటయే దీని కీర్తికి కళంకమగుచున్నది అది లేనిచో ఈవిద్యావిధానము కడు ప్రశంసనీయము" ఇది అటు సనాతనులకు ఇటు ఆధునికులకు, చెందని "గబ్బిలంజాతి" డోలాయమానచిత్తుని యభిప్రాయము

"ఈవిధానములో సర్వమతములను, వర్ణములను, యేకీకృతము చేయు కార్యక్రమము తక్క మిగత కార్యక్రమములు బోధనాపద్ధతులు, మంచివికావు" ఈ ఇత్తడితునకలు ఈవిధానము యొక్క వుత్కృష్టతను గ్రహించక, గ్రహించలేక అవస్థపడే హరిజన సోదరునివి

"ఇది కాంగ్రెస్‌వారు తాము గాంధీభక్తులమని చెప్పకొనేటందుకు ఎన్నికలకోసం చేసిన స్టంటు. ఇది యీప్రభుత్వంతో అంతరించి పోవలసిందే ? మరి యే ప్రభుత్వమును దీనిని అభిమానింపజాల్దదు. "ఈధోరణి యీవిద్యావిధాన ప్రధానాశయమును గ్రహింపలేక రాజకీయపార్టీ వున్మాదముచే కలవరము చెందిన అణాకాని రాజకీయవాదిది

"ఇలాంటివెన్నివిధానాలు చూశాం కాదు ? వాటిల్లో ఇదొకటి మామావిధానాలన్నీ మూల పడ్డాయి ఇదిమాత్రం కడవరకు సాగియేడుస్తుందా ? ఇది బాహ్యప్రపంచవిషయాలు గ్రహించలేక కేవలం జిల్లాబోర్డు ఆర్డర్లు, బదిలీలు, మొదలైన కార్యక్రమాలల్లో పడి, కొట్టుకొనే ఉపాధ్యాయ సోదరుని వుద్దేశ్యము

"దీనివల్ల పురుషులు స్త్రీల అవసరాన్ని విస్మరించి, గృహకృత్యాలు కూడా వారే నిర్వర్తింప గలిగిన, ఆడవారికి కొంతవిశ్రాంతి కలుగజేస్తారు. అంటే ఇది మగవారిని ఆడవారినిగా చేయుటకు పనికి వచ్చుచున్నది. ఇదియొక వుపాధ్యాయిని యొక్క హాస్యపూరిత విమర్శనము

ఇంకను పలురకములైన వ్యక్తులు, పత్రికలు పెక్కు రీతుల విమర్శించుటకద్దు. కాని యీ విధానమును గూర్చి సామాన్యులిట్లు విమర్శించుటలో ఆశ్చర్యము లేదు

ఏలయన పూజ్య బాపూజీ యీ విద్యావిధాన స్వరూపమును, దాని యావశ్యకతనుగూర్చి "హరిజన్" పత్రికలో ప్రప్రథమముగా వ్యాసము ప్రకటించినప్పుడు దేశంలో పెద్దపెద్ద విద్యావేత్తలు, మానసికవేత్తలు అనుకొని పెద్దపెద్ద బిరుగులు తగిలించుకొన్నవారంతా "ఎవడో గోచిపాతరాయుడు రాజకీయపు గొడవలలోపడి కొట్టుకొనేవాడు పెద్ద విద్యావేత్తలు యింతమంది వుండగా తాను స్వతంత్రించి విద్యాశాఖలో మార్పును తీసుకురావాలని సూచించడమా అని విమర్శించారు

అటువిదప మహాత్ముడు దేశంలోగల వివిధ రాజకీయ, విద్యా, మనస్తత్వ వేత్తలను 1937 అక్టోబరు నెలలో 'వార్ధా' యందు సమావేశపరచి యీ విద్యావిధానముయొక్క స్వరూపమునుగూర్చి, దాని ఉత్కృష్టతను గూర్చి దానివలన దేశంలో రాగల మార్పులను గురించి, దాని మనుగడనుగూర్చి అది మనదేశ స్థితిగతులకు శీతోష్ణస్థితికి యెట్లు తగియున్నదను

# విద్యావ్యాప్తి భూజపుష్పములకు మంచుదెబ్బ

బూరాడ గోపాలం - ప్రయివేటుటీచరు - గెడ్డవానిపేట.

ఈ ప్రభుత్వము వచ్చిందిలగాయితు విద్యాభివృద్ధి-వయోజనులవిద్యాభివృద్ధి కావాలని సగుపాయములుచేస్తూ ఎల్లప్పుడు విద్యావిషయిక ప్రచారాలు చేస్తున్నాది బాగుంది కాని కొన్ని చీడ పురుగలు మాత్రము విద్యాసస్యాన్ని పాడుచేస్తున్నవి మొదటిది పబ్లిక VIII Std పరీక్షలకు హాజరు కాబోయే వారి ఇక్కట్లు

ఈ **VIII Std.** పరీక్షలు సాగించడం విద్యాభివృద్ధిని గోరియేకదా! ఆపరీక్ష **pass** అయ్యేకా మాస్టరుగిరీ చేయడానికి మంచి అవకాశమిచ్చిందీ గూడా విద్యాభివృద్ధిని గోరియేగదా! అయితే అందరూ విద్యనభ్యసించ యత్నించుచున్నారా? లేదు. అర ఆకలిలో అలమటించి పోతున్న ఈ కాలపు ఉపాధ్యాయుల జూచి ఈవృత్తిపై రోత పుట్టి, వ్యవసాయమో! లేక యేరైల్వే ఉద్యోగమో, చేసుకుంటే పొట్టనిండుతుందని-మాస్టరు పనిచేయకుండా మానినవారు 50% మంది

మిగిలినవారిలో కొందరు "ఉపాధ్యాయునిక్కి ఈ రోజుల్లో మర్యాదాలేదనిన్నీ, అసలు ఆమాస్టరుగా తయారు అవడానికే ఎన్నో వ్యయప్రయాసాలు పడాలనిన్నీ, అయ్యేకా, పై ఆఫీసరుల దాడులకు యోర్వాలనిన్నీ, అన్నీ జయించుకొని తెచ్చుకొన్న జీతంలో ముడుపులుపోను మిగిలేగి చంటిపిల్ల పాలకప్పుకే చాలదనీ, వితర్కించుకొని ఉపాధ్యాయుడు అగుటకు ఇష్టపడక ఏవ్యాపారస్థునివద్దనో గుమస్తాగా చేరి జీవించనెంచినవారు కొందరు ఇంకామిగిలిన వారిలో కొందరుమాత్రము "పోనీ నిరుద్యోగంగా బ్రతికేకన్నా ప్రభుత్వముయొక్క విద్యాభివృద్ధి యత్నానికి చేదోడుగానుండి మేస్టరుగిరిచేస్తూ వచ్చే జీతంతో కూరఖర్చు గడుపుకొంటే మనకున్న భూములుచాలవా? తిండికి అని మొదట 8th స్టాండర్డు పరీక్షకు హాజరయ్యేందుకు యత్నిస్తారు వారు అప్లికేషను ఫారాలకోసం పాట్లుపడడం వలన విరక్తి పొంది మానేసినవారు వారిలో కొందరు

ఈపరీక్షా ప్రవేశఫారాలు నేరుగా విద్యార్థులకు పంపరాదట. ఇనస్పెక్టర్లద్వారా నే సంపాదించుకోవాలట. అందుచే తప్పనిసరిగా శ్రీవారి నారాధించక తప్పదు. వారు ఆరాధించేవారికి "రేపు" అని గోడపై వ్రాసి చూపించడము అలవాటు అధిదేవతా ప్రత్యధిదేవతల నారాధించడము ప్రారంభం వీరి మూకవ్రతం అంతంరావడానికి గడువెంతకాలమో ఎవరికెరుక? అప్పుడు పరివారదేవతల నాశ్రయించడము జరుగుతుంది ఈ దేవతలుమాత్రము చాలా కనికరముగలవి వెంటనే "మాకొక్క చెల్లించుకోవాలంటే (2, 3 వ్రేళ్ళనుజూపి) ముడుపుచెల్లించుకో, మేము రేపు ఈపాటికి నీకొక్క చెల్లించు

౨౩౧ వ పేజీ తరువాయి

విషయమునుగూర్చి చర్చించి ఒక నూతన విద్యావిధానమును వెలువరించిరి దానికే 'వార్ధా విద్యావిధానం బేసిక్ విద్య నవీనవిద్య మూలాధారవిద్య యని పేళ్లు

ఇందువలన మనకు "ఏ విద్యావిధానమునకైనను, ప్రచారము అనునది అత్యావశ్యకము'' అను విషయం గ్రాహ్యము కాగలదు అందును సామాన్యులలో ప్రచారము మిక్కిలి యవసరము. ఎట్లన, ఒక కంపెనీ వారొక చలనచిత్రమును తీయదలచి ప్రయత్నము చేయుచుండిరనుకొందము అట్టితరి ఆ చిత్రమునకు కవిగారు "పాటలు-మాటలు" వ్రాయకముందే పత్రికలలో "నవరసభరితమైన చిత్రరాజము శరవేగంతో వస్తోంది; వీనులకు విందొసగు సంగీతం, మనస్సును జిగేల్, జిగేల్ మనిపించే నాట్యములు కలిగి మీ అభిమాన ప్రజ్ఞాన్విత తారాగణంతో తయారగుచున్నది" అని ప్రకటనలు ప్రారంభిస్తారు చివరకు అది అతుకులబొంత 'తుక్కు' చిత్రమైనా ప్రచార ప్రభావంవల్ల కొంతడబ్బు సంపాదిస్తుంది

కావున యీ విధానమునుగూర్చిన గురకిప్రాయమును ఖండించి దీని ప్రాశస్త్యమును ప్రచారము చేయుట ఆ శిక్షణపొందిన మా బోంట్ల విధ్యుక్త ధర్మముగనుక యీ విధానమునుగూర్చి 4, 5 వ్యాసములలో వుపాధ్యాయ సోదరులకు మనవి చేసుకొందును ఇందుకు మన "ఆంధ్రరాష్ట్ర ప్రారంభ విద్య''సంపాదక మహాశయులు తమ పత్రికలద్వారా మీకు నా అభిప్రాయముల నందజేయుదురని ఆశించుచున్నాను. జైహింద్!

తాము "చూడు మామజా" అంటూ ఇంకకొంచెం ఘారాలేవున్నవి మీలాగే అనేకులు వస్తున్నారు లేవని అంటున్నాము. తెలుసా? (మళ్లీ వేళ్లు చూపుతూ) ఈవిధంగా అప్పుడే 100 ఫారాలు అయిపోయినవి రహస్యంగా మేము రప్పించి మీ కోర్కె చెల్లిస్తున్నాము ఏమాయిష్టం ఆలసించినచో ఆశాభంగమగును సమయానుకూలముగా రేట్లు హెచ్చింపబడుననే షరాలోగూడా వల్లెవేశేస్తారు. బేరమాడితే మౌనవ్రతం అవలంబిస్తారు

ఇదివరకు యీవిధముగా బేరమాడి, గడువు కాలం మీరిపోవుటచే పరీక్షకు హాజరుకాలేక, వ్యసనపడుతున్న ప్రాణి ఏంజేస్తుంది? కాఫీఖర్చుకైనా లేకపోయినాసరే ఆముదుపు చెల్లించి ఆగ్రహం తీర్చుకుంటుంది కొన్నిప్రాణులు ఈ సమయములో మొదటికే చగుపుమాట ఎత్తకుండా విరమించుకుంటాయి ఈవిధంగ మా సేవారు మిగిలిన పాలిక భాగంలో సగంమంది.

ఎన్నడు లంచగొండితనం ఎరుగని విద్యాశాఖలోనే ఈవిధంగా ఓ, న, మాలు నేర్పేందుకు బదులు "లంచము" అనే అక్షరములు నేర్పుతూంటే ఈ లంచపు పిశాచి మనలను ఎపుడు వదలుతుంది? మద్యపిశాచివలె కొన్నినూర్లు లేక వేలయేండ్లు పరిపాలించి, మనలను పిల్చిపిప్పిచేయకుండా వదలుతుందా? బాల్యంలోనే విద్యకు ఆవేశించే యీ లంచగ్రహాన్ని తప్పిస్తే వయస్సు వచ్చినతర్వాత ఎలాగైనా కొంతకాలం నిలవడానికి విద్యకు వీలు చిక్కుతుంది.

8th స్టాండర్డు పరీక్షకు ఎక్కువమంది హాజరవాలి వారంతా ఉపాధ్యాయులు కావాలి విద్యాభివృద్ధి కావాలి అని ఆశించినట్లయితే పైఆటంకములు ముఖ్యంగా అప్లికేషను ఫారాలు, నేరుగా (దక్షిణ హిందూస్తానీ ప్రచారకసభవారికి మళ్లీ) కొంత పైకము విద్యార్థులవద్ద పుచ్చుకొని కోరినవారందరికి లేదనకుండా అందజేయాలి అప్పుడే విద్యాశ్రమభూజమున వికసించిన పువ్వులన్నీ దక్కుతవి లేకుంటే ఈలంచపు మంచుదెబ్బలకు రాలిపోతవి విత్తనంగూడా కరవైపోతుంది

ఐతే నేరుగా విద్యార్థులకు ఫారాలుపంపినందున నష్టం ఉన్నదా? లేదు ఇక విద్యార్థులు ఎక్కువ ఫారాలు నిలవచేసుకొన్నందువలన లాభం సున్నా ఆ పరీక్షకే దక్క మరెందుకు కొరగాని ఫారాలు నిలవచేసుకోవలసిన అగత్యము ఎవరికీ ఉండదు కావలసినన్ని ఫారాలు వలసినవారందరికి అందుబాటులో నున్నప్పుడు యీవిషయమున "బ్లాకు మార్కెట్టు" దేవతాదర్శనంగూడా కాదు

కాన శ్రీ ప్రభుత్వమువారు కొంతపైకమును నిర్ణయించి, కావలసిన వారందరకు 8th స్టాండర్డు ఫారాలు అందజేసి, ఆవిద్యార్థుల ఉత్సాహమునకు భంగములేకుండా విద్యాభివృద్ధిని జేయగోరుట సమంజసము ఇందువలన గా విద్యాశాఖకు కొంత ధనముగూడా చెందును లంచపు దేవతాదాసులకు వృథాముడుపులు చెల్లించనవసరముండదు.



# ప్రావిడెంటు ఫండు రూల్సు

తర్జుమాదారు కొండ్రెడ్డి సూర్యప్రకాశం. (కొర్లపాటివారిపాలెం)

(డిశంబరు నెల తరువాయి)

(డి) ప్రయివేటు మేనేజిమెంటులోనున్న విద్యాలయములు తమ స్వంతప్రావిడెంటుఫండ్సును కలిగియున్నప్పుడు, ప్రభుత్వమువారి ప్రావిడెంటుఫండులో కలిపి వేయుటకుగాను, డైరెక్టరువారికి దరఖాస్తు చేసుకొనవచ్చును డైరెక్టరువారు అట్టి దరఖాస్తులను మంజూరు చేయవచ్చును అందుపైని అందుకు సంబంధించిన మేనేజిమెంటు, ఆప్రావిడెంటుఫండును తీసివేసి, ప్రతిచందాదారుని తరఫున పోస్టాఫీసు సేవింగ్సుబ్యాంకులో బాకీమొత్తము నిలువసొమ్ము డిపాజిటు చేయవచ్చును అట్టి మొత్తములు ప్రభుత్వఫండునుండి వారు తీసికొనునపుడు ఆసొమ్ముకు వచ్చేవడ్డీతో సహా చందాదారులకు చెల్లింపబడవచ్చును

3 (ఎ) చెల్లింపబడవలసిన చందా మొత్తముయొక్క ప్రొపోర్షను లేక విధానము.

ఫండుకు నిలువచేయుసొమ్ము జీతముమీద నూటికి రు 6-4-0 లు (అనగా రూపాయికి అణా) రూపాయలోని భాగములకు కంట్రిబ్యూషను లెక్కించునపుడు చందాదారునియొక్క జీతములో రూపాయలోని భాగములున్నచో అట్టి భాగములమీద ఫండు చెల్లించనక్కరలేదు చందాదారు పెరమనెంటు లేక టెంపోరరీ ఉద్యోగమును కలిగియున్నపుడు, అతని సబ్ స్టాంటివ్ జతముమీద ఫండుకు చెల్లించు మొత్తములు లెక్కింపబడవలెను. చందాదారు అఫీషియేటింగు ఉద్యోగమును మాత్రమే కలిగియున్నపుడు, అతని అసలు జీతముపైని చెల్లింపబడవలెను ఒక చందాదారు సెలవుమీద మానివేసినపుడుగాని, యితర కారణములవల్లగాని, టెంపొరరీగా (తాత్కాలికముగా) తగ్గింపబడిన జీతము పుచ్చుకొనినపుడు, అట్టె తగ్గింపబడిన జీతముమీదనే ఆ చందాదారుయొక్కయు, మేనేజిమెంటుయొక్కయు చెల్లింపబడు కంట్రిబ్యూషనుసొమ్ము నిజముగా అతనికి చెల్లించిన సొమ్ముమీదనే గుణింపబడవలెను. చందాదార్లు అటువంటిజీతం నష్టము సెలవులు, హైరుహాజర్లు, గల కాలములకు ఫండు చెల్లించరాదని బాగుగా తెలిసికొనియుండవలెను చెల్లింపబడవలసిన మొత్తములకంటె ఎక్కువగా తమ యిచ్చవచ్చిన మొత్తములు చెల్లించుటకు అంగీకరింపబడవు.

షరా —యుద్ధపు సర్వీసునుండివచ్చి, తిరిగి ఒక స్కూలులోచేరిన చందాదారుడు, కోరినయెడల, తాను యుద్ధపు సర్వీసునకు వెళ్ళకముందు యీ స్కూలులో తీసుకొనుచున్న జీతముపైని యుద్ధపు సర్వీసులోని కాలమునకుగూడ ప్రావిడెంటుఫండు యీస్కూలులోనుండియే చెల్లించవచ్చునుగాని,అట్టి చందాదారునకు ఆస్కూలులో ఉద్యోగమును గురించిన హామీ ఉన్నపుడే అట్లు చెల్లించుటకు అర్హత కలుగును.

(బి) ప్రాథమిక పాఠశాలల విషయములో అసెస్ చేయబడిన గ్రాంటుగాని, అంతకన్నఎక్కువ జీతమునుగాని, నెలవారీగా తీసుకొను ఉపాధ్యాయులు నిజముగా వారు పుచ్చుకొనుచున్న వేతనములపై చందాలు చెల్లించవచ్చును

(స) ఒక గ్రేడు టీచర్లు పొందెడి జీతము లేక గ్రాంటుమీద ఆటీచర్లు ఎంత చందాఫండు చెల్లించెదరో ఆగ్రేడు టీచరు మేనేజర్లుగూడా ఆరేటు ప్రకారం ఫండు చెల్లించవలెను.

4. పాఠశాల మేనేజిమెంటువల్లను, గవర్నమెంటువారి వల్లను చెల్లింపబడవలసిన కంట్రిబ్యూషను .—

(ఎ) మేనేజిమెంట్లును, ప్రభుత్వమువారును, ఇద్దరునుగూడ చెల్లించవలెను. ఒక టీచరు ప్రతినెలలోను తనవంతు ఎంతసొమ్ము ఫండుక్రింద చెల్లించునో అందులో సగం భాగము సొమ్ము మేనేజరు కూడా ఆ టీచరు తరఫున చెల్లించవలెను మేనేజరు చెల్లించుసొమ్ముకూడా టీచరు అక్కౌంటుక్రిందనే జమచేయబడి, టీచరుకే యిచ్చివేయబడును.

2 వ రూలు (ఎ) లో చెప్పబడిన ప్రకారము దినమునకు నియమింపబడిన కాలముకన్న, తక్కువ

# ఉండాలోయ్! ఉండాలి!

* * *

శ్రీ నెత్తం నరసింహాచారులు.

1. పెండ్లికి ఒప్పు
తిండికి పప్పు
ఇంటికి కప్పు
వంటకు నిప్పు
కాలికి చెప్పు
సేవకు మెప్పు
ఉండాలోయ్! ఉండాలి!

2. ఆశకు అంతం
సొత్తుకు సొంతం
చదువుకు పంతం
మనసుకు శాంతం
నీతికి నియతం
బ్రతుకుకు చరితం
ఉండాలోయ్! ఉండాలి!

3. ఒంటికి వలువ
తిండికి నిలవ
కొలనుకు కలువ
వేడికి చలువ
మాటకు విలువ
ఓటుకు విలువ
ఉండాలోయ్! ఉండాలి!

4. వింటికి బాణం
శక్తికి ప్రాణం
చదువుకు జ్ఞానం
భక్తికి ధ్యానం
చేతికి దానం
గురు నభిమానం
ఉండాలోయ్! ఉండాలి!

---

౨౩౮ వ పేజీ తరువాయి

కాలము పనిచేయువారి విషయములో, ఉపాధ్యాయుని యొక్కయు, మేనేజరుయొక్కయు, చందా సొమ్ము, టీచరుయొక్క మొత్తం ఎమాల్యుమెంట్సు ననుసరించి లెక్కింపబడును. పార్టుటయిం మాత్రమే పనిచేయువారిని, నియమించిన ఒక మేనేజరు పోస్టాఫీసు సేవింగ్సుబ్యాంకులో టీచరుయొక్కయు, మేనేజరుయొక్కయు, చందాలవిషయములో వారియొక్క పూర్తిసొమ్మును చెల్లించుటకుగాను తాను జవాబుదారుడై ఉండునట్లు చూచుకొనవలెను, 7 వ సూత్రములో చెప్పబడిన ప్రకారము అన్ని రిజిష్టర్లను గూడ అతడు ఏర్పాటుచేయవలెను పార్టుటయిం ఉద్యోగి విషయంలో స్కీము ఏర్పాటు కొఱకు అతడు, మేనేజరు లేక కరస్పాండెంటుగా పనిచేయవలెను.

సూత్రము 2 (బి) (III) లో చెప్పబడిన దానిని మించి ఎలిమెంటరీ స్కూళ్ళలోని క్రైస్తవ మినిస్టరీకిగాను నియమింపబడిన వ్యక్తులవిషయములో మిషను పని క్రిందను, బోధన పని క్రిందను, కలిపి కొంత నియమిత జీతమును తీసుకొనువారు ఫండుకు ఎంతచందా చెల్లించవలెనో పబ్లికు ఇన్‌స్ట్రక్షను డైరెక్టరువారిచే నియమింపబడును.

(బి) ఒక చందాదారు రిటైరు కాబడినప్పుడు, లేక తగిన కారణములచే ప్రభుత్వమువారి అనుమతిని, తన డిపాజిటుసొమ్మును అంతయును తీసుకొనవలసివచ్చినప్పుడు, అతనియొక్క ఆనాటి బాకీమొత్తములో మూడవవంతుకు సమానమగు సొమ్మును ప్రభుత్వము వారు కలిపి యిచ్చెదరు ఇదియే గవర్నమెంటు మొత్తం కంట్రిబ్యూషను.

# ఉపాధ్యాయుడు

రచన
'ఆనందబాల'

1. తినుట కింత
తిండిలేదు
కట్టుటకొక
బట్టలేదు
చాలీ చాలని
సంపాదనతో
జీవితనౌకను
చెడుమార్గములో
పెనుగాలిలో
దుమారములో
నడపుచునుండె.

2. ఆకొలిమంటలు
అడవి యేడుపులు
అప్పుల బాధలు
అలమ టింతలు
ధనములేదు
తినుటలేదు
శాంతిలేదు
శవము బ్రదుకు
తన పిల్లలకే
చాలినంత
చదువులేదు.

3. ఆతడే భావి
భారతపౌర
నిర్మాత !
ఆలకించండి
అతనిగోడు
సుంత-
ఆతని హస్త
మందున్నది
దేశసౌభాగ్యం
అతడే ఆక్రోశిస్తే
మీబిడ్డలందరూ
మట్టిగడ్డలే !
భావిభారతమంతా
శోకభారమే !

4. అతడానందిస్తే
మన దేశం
సద్గుణ మూర్తులతో
సద్భావములతో
సన్నుతశోభలతో
రాణిస్తుంది.
అప్పుడే మన కెల్లరకు
ఆనందం !
పరమానందం !
బ్రహ్మానందం !
నిత్యానందం !

5. ఆతడెవడు ?
చినిగిన చొక్కాపై
చింపిరికోటు
పెరిగిన గడ్డం
మాసిన తల
బక్కచిక్కిన డొక్కలెన్నో
లెక్కపెట్టవచ్చు
బిక్క మొగంతో
పిచ్చివానివలె
వచ్చుచున్నాడదె
పచ్చిపేద పంతులు.

6. నాయకులంతా
అంటారు-

# ఆదర్శ ప్రశ్నపత్రము - 8 వ తరగతి — లెక్కలు

(1952 వ సంవత్సరపు పరీక్ష) మార్కులు 100

1 (a) ఒక అడుగుబద్దను రెండుగా విరచితిని. అందులో చిన్నది 2·5″ పెద్దముక్కను మరల విరచితిని అందులో చిన్నముక్క 3″ అయిన మూడుముక్కల నిష్పత్తి ఎంత ?

(b) 10 మంది బాలికలు 10 నారింజపండ్లను 10 నిమిషములలో తినిన, 15 మంది బాలికలు 15 నారింజపండ్లను ఎంతకాలములో తిందురు

2 నేను కొన్ని నారింజపండ్లను రూపాయికి 10 చొ॥న కొని వాటిని పండు 1కి 3 అ. చొ॥న అమ్మితిని నాకు మొత్తం 28 రూపాయలు లాభము వచ్చిన నేను కొన్న పండ్లెన్ని ?

3. ఒక తొట్టి 8′ పొడవు, 3′ వెడల్పు, 5′ లోతు గలిగియున్నది దానిలో 140 ఘ అ నీరు ఉన్నది నీరు తొట్టినిండా వచ్చుటకు 8′ పొడవు, 6″ వెడల్పు, 3″ దళముగల ఎన్ని ఇనుప దిమ్మలు దానిలో పడవేయవచ్చును ?

4 ఒక పిల్లవాని వయస్సు 17 సం॥ ఉన్నప్పుడు అతని తండ్రి వానిపేర కొంత ధనమును 4% చొ॥న వడ్డినిచ్చు బ్యాంకులో నిలువజేసెను పిల్లవానికి 21 సం॥ వచ్చునప్పటికి రు 20,097 లు మొత్తం అయినది అతడు మొదట బ్యాంకిలో వేసిన సొమ్మెంత ?

5 ఒకడు 360 రూ.లకు ఒక గుఱ్ఱమును, 340 రూ లకు ఇంకొక గుఱ్ఱమును కొని వాటిని తిరిగి అమ్మగా మొదటిదానిమీద 10% నష్టమును, మొత్తంపైని 2% నష్టమునువచ్చెను. రెండవ గుఱ్ఱమును ఎంతకమ్మియుండవలెను ?

6 10 ఆవుల సరాసరిఖరీదు 30 గినీలు వానిలో 4 ఆవుల ఒక్కొక్కటి 30 పౌండ్లుఖరీదు మిగిలిన ఆవుల సరాసరి వెలఎంత ?

7 ఒక ఆవుదూడను ఒక గోడకు 21 గజముల పొడవుగల త్రాటితో గట్టిన, అది ఎంతస్థలములో మేయును ? దాని చుట్టును కంచవేయుటకు గజము 1కి రు 0-3-0 చొ॥ ఎంతసొమ్మగును ?

8 ఒకబీడును 24 గేదెలు 26 రోజులలో మేయును వాటితో 25 ఆవులను చేర్చినవాటికి ఆబీడు ఎన్నిరోజులకుచాలును ? (5 ఆవులమేత 3 గేదెలకు సరిపోవును)

9 చతురస్రాకారముగల ఒక ఆటస్థలముయొక్క పొడవు 120 అ దానిచుట్టును లోపల 4 అ వెడల్పుగల దారిగలదు బాటను గచ్చుజేయుటకు చ గ 1కి రు 0-4-6 చొ॥ ఎంతఖర్చు ?

10 ఒకడు తనస్వగ్రామమునుండి సూటిగా పడమరకు 4 మైళ్ళుపోయి అక్కడ కుడిచేతుమీదుగా 40° తిరిగి, 3 మైళ్ళుపోయెను ఇప్పుడతడు బైలుదేరినస్థలమునకు ఎంతదూరములో నున్నాడు ? (స్కేలునకు పటము గీయుము)

CH. ANTHONY,
S. R. H. Higher Elementary School, Mustabad

---

౨౩౬ వ పేజీ తరువాయి

"అతడే భావిభారత
పౌర నిర్మాత!
దేశవైభవం
అతనిపైనే
నిలిచివుం"దని-
అతడే యీగతి
అలమటింపగా
అతనికృషి యేగతి
ఫలింపగలదో
ఊహించండీ!
కన్నులు తెరచీ
కాంచండీ!

# ఆదర్శ ప్రశ్నపత్రము-8 వ తరగతి-తెలుగు

(1952 సం|| పరీక్ష)

**Time 2 hours**

I ఉత్తమ మాతవిధులేవి ? ఎట్టి స్త్రీ ఉత్తమ మాతయని పిలువబడును ? లేక కుశుడు కుముద్వతి నెట్లు పెండ్లాడెను ? దానివిశిష్టతయేమి ? 10

II ఈ క్రింది పద్యము పాదభంగముగాకుండ వ్రాసి తాత్పర్యము వ్రాయుము ఫణులు...మదిని ! 8

III "తేజిత ..మత్సరంబునన్"-అను పద్యము పాదభంగము కాకుండ వ్రాయుము, 6

IV 'విద్యారహస్యంబులర్థి వడిసె' ఎవరు ? ఎట్లు ? దానిఫలితమేమి : లేక క్షయవ్యాధి ముఖ్యలక్షణములేవి ? వానినిగూర్చి నీవు తీసికొను జాగ్రత్తయేమి ? 12

V ఈ క్రింది వానిలో నొక్కదానికి మాత్రము జవాబిమ్ము 12

(a) శ్రీ కృష్ణుని జన్మదినమున గలిగిన యుత్సవము లెట్టివి ? ఏల ?

(b) వేటకై వెడలిన రాజు గాంచినదేమి ? అతని ఆశ్చర్యమునకు కారణమేమి ? దానిఫలితమేమి ?

VI ఈ దిగువవానిలో నొక్కదానికి జవాబిమ్ము 12

(a) శ్రీ రాముని దర్శింపనేగిన జడదారి ఎవరు ? అతడేలవచ్చెను ? అతనిరాక లక్ష్మణునకెట్లు పరిణమించెను ?

(b) మనదేశమందు క్షయవ్యాధి ఎట్టి స్థితిలోనున్నది ? దానిని గురించి నీ కర్తవ్యమేమి?

(c) మూఢస్త్రీల నమ్మకమేమి ? నీవు దానిని పోగొట్టుటకేమి చేతువు ?

VII 1. ద్విజుడు, గవాక్షము, తనయుడు, కృష్ణపక్షుడు-వ్యుత్పత్తి అర్థములు వ్రాయుము 4

2 క్షేత్రము, దశ, గుణము, పరులు-రెండేసి అర్థములు వ్రాయుము. 4

3 మచ్చరము, యజ్ఞము, సాయము, అచ్చెరువు-ప్రకృతులకు వికృతులు, వికృతులకు ప్రకృతులు, వ్రాయుము 4

4 కలిమి, పుణ్యము, అపేక్ష, దుర్గతి-వ్యతిరేకపదములు వ్రాయుము 4

5 నెమ్మది, అక్కుమారుడు, సర్వోత్తమము, నిర్మానుష్యము విడదీసి వ్రాయుము 4

VIII ఈ క్రిందివానిలో నొకదానినిగురించి ఒక పుటకు మించకుండ వ్యాసము వ్రాయుము. 20

1 మద్యపాననిషేధమువలన లాభములు

2 ప్రజాప్రభుత్వములో మనము పొందినమేళ్ళు

3 బాలభటోద్యమము



# ఆదర్శ ప్రశ్నపత్రము - 8 వ తరగతి - 1952

(చరిత్ర) కాలము 2 గం.

1. (a) బానిసవంశపు రాజులలో గొప్పవాడెవడు ? ఏల ? 6

(b) అక్బరు హిందువుల అభిమానము నెట్లు సంపాదించెను ? 6

2. మూడవ మైసూరు యుద్ధకారణములు, ఫలితములు, వ్రాయుము. లేక 8
విజయనగరసామ్రాజ్య పతనకారణములను వ్రాయుము.

3 ఈ క్రిందివానిని గురించి క్లుప్తముగా వ్రాయుము. 15

(a) శాశ్వత శిస్తునిర్ణయచట్టము (b) రాజరామమోహనరాయలు (c) కర్జను ప్రభువు (d) ద్వంద్వపరిపాలన (e) దత్తత నిరసన శాసనము.

4. విక్టోరియా మహారాణి ప్రకటనలోని ముఖ్యవిషయములేవి ? 5

(భూగోళము)

5. ఈ క్రిందివానికి కారణములిమ్ము. 15

(a) బొంబాయిలో నేతపరిశ్రమ.
(b) హోయాంగ్ హో చీనా గుఃఖదాయిని.
(c) గంగా మైదానమున జనసంఖ్య హెచ్చు.
(d) స్వీడన్ అగ్గిపుల్లలకు ప్రసిద్ధి.
(e) ఈజిప్టు నైలునది వరము.

6. ఇండియాలో నాలుగు ముఖ్యరేవు పట్టణములను పేర్కొని, అంగు ప్రతిదానుండి ఎగుమతియగు నొకసరకును తెల్పుము. 8

7. ఈ క్రింది సరకులనే యేస్థలములనుండి మనదేశము తెప్పించుకొనుచున్నది ?

(a) రైలుయింజనులు (b) కిరసనాయిల్ (c) గడియారములు (d) కాగితము (e) చక్కెర 5

8. ఐరోపాలోని మూడు ముఖ్యనదులను పేర్కొని, అందు మిగులవుపయోగకరమైన దానిని వివరింపుము. 12

(b) అగ్నిపర్వతములెట్లు ఏర్పడుచున్నవి ? తరచు వాటివల్ల ఏదేశము నష్టపడుచున్నది ?

(c) మధ్య ధరాభూములేవి ? అక్కడ పండు పంటలేవి ?

(సివిక్సు)

9 విరామకాలమును సద్వినియోగపరచు మూడు ముఖ్యపద్ధతులను తెల్పుము. 10

10 గ్రామ పంచాయితీ ధర్మములేవి ? లేక 10
పన్నులు ఏల చెల్లించవలెను ? మూడుముఖ్యమైన పన్నులు పేర్కొనుము

Srimathi NAGARATNAM, Ch.
Mistress,
S. R. H. Higher Ely. School, Mustabada.




జుఝువరపు-వేంకటేశ్వరరావు.

వినండి వినండి బాలుల్లారా!
వినండి వినండి వీరుల్లారా!
ఢిల్లీ కథ చెప్పెద మీకు
అల్లరి మాని వినండి మీరు.

పూర్వకాలంలో ఈ నగరమునకు
పేరు ఇంద్రప్రస్థపురమండీ
పునాది వేసిరి పాండవు లానాడు
పరిపాలించిరి ఇంద్రప్రస్థాన్ని
కౌరవ పాండవ సమరభూమి
కురుక్షేత్ర మ్మాప్రక్కనె యున్నది
మరపురాని సమరా లెన్నెన్నో ఈ
పురమునందే జరిగినాయి

ఆర్యపుత్రుడు పృథ్వీరాజు-ఈ
పురములోననె పోరినాడు
ప్రశాంతమూర్తి అక్బరుపాదుషా
పాలన జేసె నీపురమునానాడు
రాజాధిరాజుల వీరాధివీరుల
ఘోరాతిఘోర సమరాలు జరిగె నిందు.
నాటి చరిత్రలు నేటికిగూడా
పాడుపడిన గోడలమీద
సురక్షితముగ వ్రాసియున్నవి
పరికించి రండో సోదరులారా

విరిగినకోటలు జరిగినకథలను
మరపురాకుండా మరిమరి చెప్పును

మహమ్మదు పాదుషా షాజహాన్
నిర్మించె నానాడు ఈ ఢిల్లీనగరమును
ఆనాటినుండి ఇంద్రప్రస్థనగరం
ఈనాటివరకు ఢిల్లీ యనబడుచుండె.
లాల్ ఖిల్లా కట్టించినా డీ పాదుషా
జామా మసీదు నిర్మించినా డీ సుల్తాన్
చూడదగ చోద్యాలెన్నో తురుష్కులు
వేడుకతో నిర్మించిరి ఢిల్లీయందు.

తురకలపాలన యంత మొందగనె
ఆంగ్లేయరాజులు అడుగుపెట్టిరి
వ్యాపారమని సాకులు జెప్పిరి
కోటలు మెల్లగ నీటుగ కట్టిరి
కారణ మడిగిన కావలి యనిరి
అన్నదమ్ముల్లో కలహాలు పెంచి
మన్నుపాలు జేసి గద్దె లెక్కిరి
కల్లకపటులైన ఈతెల్లదొరలెల్ల
న్యూఢిల్లీ నగరము నిర్మించినారు

కోట్లకోట్లుగ ధనం ఖర్చుపెట్టి
కోటలు గట్టిగ కట్టించారు
పార్లమెంటు భవన మిందే కలదు.
గవర్నరు మహలును ఇందే గలదు
ప్రభుత్వ కార్యాలయము లన్నియు ఈ
న్యూఢిల్లీనగర మందే యున్నవి
భారతదేశపు రాజధాని ఈ
న్యూఢిల్లీనగరము చూడతగ్గది.




## ౧ టీచర్లకు, టీచరుమేనేజర్లకు, మేనేజర్లకు హెచ్చరిక

ఎయిడెడ్ స్కూళ్ళ టీచరు మేనేజర్లు, మేనేజర్లు, రు 3-0-0 ల సమస్యనుగూర్చి ఆంధ్రరాష్ట్ర టీచర్సు సంఘమువారు ప్రకటించిన ప్రకారము అతిత్వరితములో, అతిచురుకుగా M L. A ల ద్వారాను M L C లద్వారాను, విజ్ఞప్తిపత్రములను విద్యాశాఖామంత్రిగారికి పంపుచు ఒక కాపీ "కొత్తపల్లి సీతారామయ్యగారు, టీచరుమేనేజరు R అగ్రహారం, గుంటూరు'' అనిగూడ పంపుట చాలా అవసరం.

సంఘీభావమే బలముగావున, సకాలములో సక్రమమగు ఆందోళనచేసి, సఫలీకృత మనోరథులగుదురుగాక! లేనిచో తీరని నష్టము వాటిల్లును వ్యక్తిగతముగాను, సెంటరుక్లాసుల ద్వారాను, టీచర్ల యూనియనులద్వారాను, టిచరుమేనేజర్ల అసోసియేషనులద్వారాను గూడ, మీతాలూకాకు చెందిన యం యల్ ఎ అండ్ యం యల్ సి లద్వారా మంత్రిగారికి పంపవచ్చును.

## ౨ ఎయిడెడ్ మేనేజర్లకు విజ్ఞప్తి

1951 కేలెండరు సంవత్సరం, నవంబరు, డిశంబరు, నెలల గ్రాంటు 15-3-1952 షుమారం తేదీనుండు వెనుకలలో రావచ్చును. ది 15-12-1951 తేదీనుండి 15-3-1952 తేదీవరకుగల 3 నెలలలోను గ్రాంటు బిల్సురాకుండగలవు కావున టీచర్లు, మేనేజర్లు, టీచరుమేనేజర్లు, ఖర్చులు చాలావరకు తగ్గించుకొని, జాగ్రత్తగా కాలక్షేపముచేయవలెను కాని 1-1-1952 తేదీసాయంత్రమున కందునటుల డిశంబరు నెలసరి లెక్క పంపివేయువలసియున్నది మరిన్నీ జనవరి 15 తేదీలోగా 12 నెలలగ్రాంటు, అండ్ డి. అలవెన్సు స్టేటుమెంటును, తప్పులులేకుండా టీచరువారీగా సంవత్సరమునకు ఒకరకమున్నూ, నెలవారీగా ఒకరకమున్నూ, 2 స్టేటుమెంట్లను తయారుచేసి, నకళ్లు మీరుంచుకొని, అసలు ప్రతులను మీమీ పరీక్షాధికారులకు పంపుట మంచిది. మీకు 28-2-52 తేదీ వేయబడి 15-3-52 ఆ ప్రాంతమందు వచ్చెడు ఫైనలుబిల్లులో 1 టి జి. (2) డి ఎ (3) యం జి లను ముందుగా 15-1-52 లోగా తెలిసికొనుట మంచిది మీతాలూకు శలవుల లిస్టులు జనవరి మొదటివారములోనే అధికార్లకు పంపివేయుడు.

స్కూలు వయస్సు పిల్లలజనాభాను డిశంబరులోనే రివైజుచేయనివారు, జనవరిలోనైనా రివైజుచేసి, ఆయంకెలు అధికార్లకు తెలియజేయుట సమంజసము. మన స్కూళ్ళలో రికార్డువర్కుపని లోపములుండరాదు ఏకాగితము అయినను 4 రోజులు ముందుగనే పంపుట మంచిది ఆఫీసర్లచేత తరుచు అడిగించుకొనిన పిదప పంపుట మంచి అనిపించుకొనదు ఏఒక్కకాగితము టైముకు రాకపోయినను పని అంతయు ఆగిపోవును ఆ ఒక్కస్కూలు నెలసరిలెక్క రాకపోయినను మిగత అన్నిస్కూళ్ళ గ్రాంటు బిల్లులుగూడ ఆలస్యమగును కావున సకాలములోలేక ముందుగనే పంపుట ఆదర్శనీయము ది 16-1-52 నుండి 15-2-52 వరకు ఒకనెల మనస్కూల్సులో క్రొత్తపిల్లలను పరీక్షాధికారి పర్మిషనులేకుండా జేర్చుకొనవచ్చును. సెలవుల లిస్టులు-ఇందు సాలీనా బడిదినములు 220 క తగ్గరాదు అంతకు పైగా 10 బడిదినము లెక్కువున్న యెడల మంచిది లేనిచో అనుకొనని పరిస్థితులు వచ్చి స్కూలు మూయవలసివచ్చినచో ఆరోజులకుగ్రాంటు తగ్గించివేసెదరు ప్రతిటీచరుకు తరగతి రోలుసంఖ్య 63 వరకు ఉండునట్లు విజిట్లలోని తరగతివారీ హాజరు సంఖ్య 21 తగ్గకుండాను, చూచుకొనుట చాలా ఉత్తమము. గ్రాంటు నష్టములుకలుగవు.

కొర్లపాటివారిపాలెం,
(అంబాజీపేట)
ది 22—12—51

కొండ్రెడ్డి సూర్యప్రకాశం,
ఎ ఇ యస్ టి యం. అండు మేనేజర్ల సంఘము,
అమలాపురం తాలూకా.

## ౩. నవభారత రాజ్యాంగములో ప్రాథమికోపాధ్యాయుడు

పరాయిప్రభుత్వ హయాములో తక్కువజీతాలతో, బానిసబ్రతుకుతో, దుర్భరజీవితములు గడపిన ప్రాథమిక ఉపాధ్యాయులు ప్రజాప్రభుత్వమువచ్చినది మనయిడుమలు తీరునని ఎంతో ఆశించిరి. కాని యీనవభారతావనిలో యిదివరకుకంటె ఎక్కుడుగుర్భర జీవితము ప్రాథమిక ఉపాధ్యాయుడు గడుపుచుండుట శోచనీయము యిదివరకుకంటె ఎక్కువ జీతాలిచ్చుచున్నామని శ్రీగవర్నమెంటువారు పదేపదే చెప్పుచున్నారు నిజమే కొద్దిజీతములను పెంచినారు కాని ధరలు లోగడకంటె విపరీతమై ఆకాశమంటుచుండుటచే సామాన్యజీవితము గడుపుట దుర్లభము. నేడు ప్రాథమికోపాధ్యాయుడు అర్ధాకలితో నిరాశ జెందియున్నాడు "దేశమంతటా చదువరులుకావాలి" అనిచెప్పు శ్రీవారు ప్రాథమికోపాధ్యాయుల కడుపుమాడ్చుటయేనా విద్యాభివృద్ధి ?

అర్థికబాధలచే కృంగికృశించు ప్రాథమికోపాధ్యాయుడు ఎట్లుబోధన జరుపగలడు ? ఎట్లు ఆదర్శప్రాయుడుగా జీవితముగడుపును ? అని ప్రభుత్వము ఆలోచించవలదా ? శ్రీవారు ఈమధ్య సెంకడరీగ్రేడు ఉపాధ్యాయులకు స్కేల్సు పెంచుటకు యోచించుచున్నామని ప్రకటించినారు కాని ప్రాథమికోపాధ్యాయుల మాటేమిటి ? ఇట్లుఅడుగున బడియుండవలసినదేనా ? ఎప్పటికైనా దొరకునా ? ప్రజాప్రభుత్వముకూడ యింతనిర్దయకల్గియుండుట సమంజసమా ? కావున సోదర ప్రాథమికోపాధ్యాయ లోకమంతయు ఏకగ్రీవముగా తమ తీవ్రఅసమ్మతిని తెలియజేసి, ప్రాథమికఉపాధ్యాయుని దుస్థితిని తొలగించుటకు ప్రభుత్వదృష్టికి తెచ్చెదరని ఆశించుచున్నాను

## ౪. ఎన్నికలు

రాబోవు ఎన్నికలకు మద్రాసురాజధానిలో ఉపాధ్యాయుల కష్టనిష్ఠురములు తెల్పుటకుగాను 6 స్థానములేర్పరచినారు అట్లుచేసినందులకు ప్రభుత్వమునకు సదాకృతజ్ఞులము. కాని ప్రాథమిక ఉపాధ్యాయునికి (హయ్యరుగ్రేడు, సెకండరీగ్రేడు) దానిలో వోటింగ్ హక్కులేకపోవుట మిక్కిలి విచారకరము. ఉపాధ్యాయ నియోజకవర్గములో ప్రాథమిక ఉపాధ్యాయునికి స్థానములేకపోవుట దానిపేరునకే కళంకము.

ప్రాథమిక ఉపాధ్యాయుడు కష్టముతెల్పుకొనుటకు అర్హుడుగాడా ? ప్రాథమిక ఉపాధ్యాయుల కష్టసుఖములకు ప్రభుత్వ బాధ్యతలేదా ? ప్రాథమిక ఉపాధ్యాయులయెడ ప్రజాప్రభుత్వమునకుగూడ యింతనిర్దాక్షిణ్యమా ?

ప్రజాప్రభుత్వమే యిట్లు ప్రాథమికోపాధ్యాయ లోకమునకు అన్యాయముచేయుట చాలవిషాదకరముగాయున్నది. నేటి భారతావనిలో ప్రాథమికోపాధ్యాయునికి "ఉపాధ్యాయ" వోటింగ్ లేకపోవుట పౌరసత్వభంగము ఇదితీరని అపచారము. కాన సోదరఉపాధ్యాయులందరు ప్రభుత్వమునకు తమతీవ్ర అసమ్మతి తెలియజేయవలసినదిగా ఈలేఖలద్వారా మనవి చేయుచున్నాను.

ఇట్లు

యం. వి. రాఘవయ్య,

టీచర్. జలపవారి గూడెం

---

## వివేక ప్రశ్నలు

కలవు రెండు పొడుగుకాళ్లు, కదలలేను :
ఆను లేక నిలువలేను సుంత,
ఒడలినిండ కణుపులుండును, నన్నెక్కి
ఎత్తులెక్కుచుందు రెవరు నేను ? ౧

అరసాడ జగ్గారావు పట్నాయక్,
హెడ్మాష్టరు - త్సలివెంద్రి.

అక్షరములారు, రాగద్వయంబు వచ్చు ;
ఆ పదమె ఒక యూషధం బనగఁ జెల్లు ;
ప్రథమ వర్ణత్రయము వత్సరమున కొప్పు,
దీని పేరేమొ తెల్పుడు - ధీనిపుణులు. ౨

శ్రీమతి వి. మాణిక్యమ్మ,
ఉపాధ్యాయిని - ధర్మవరం.

# డిశంబరు నెల చిత్రప్రశ్నలు

(1951 సం॥ డిశంబరు నెల సంచికలో ప్రకటింపబడిన)

## వివేక ప్రశ్నలు

అను చిత్రప్రశ్నలకు సమాధానము

**౧. కుతలము, ౨. మధుర**

* * *

చందానెం. రెండు ప్రశ్నలకు సరియైన సమాధానములు పంపినవారు

459 పిరిడి సీతారాములు గారు-హెడ్మాష్టరు-వాడాడ
205 ఎ వి గోవిందరాజు గారు-హెడ్మాష్టరు-తోపుదుర్తి
484 కె రామన్న గారు-రిటైర్డుటీచరు-కోడుమూరు
270 భోగాపురపు సీతారామస్వామిగారు-హెడ్మాష్టరు-కొట్టిక
569 కలిదిండి సత్యనారాయణరాజు గారు-టీచరు-మొయిద
111 దుంపరామమూర్తిగారు -టీచరు-చింతపల్లి పేట
248 ............................ .పొట్నూరు
82 కె చంద్రాయుడు గారు-టీచరు-కొడవండ్లపల్లె
414 వేల్పూరు వెంకటనరసింహారావుగారు-టీచరు-దమ్మాలపాడు
372 దోశల తమ్మిశెట్టి గారు-టీచరు-కింతలవాని పేట
9 శేగడి సత్యనారాయణ గారు-మేనేజరు-కోటిపాం
330 బి సి వి సుబ్బరాజు గారు-హెడ్మాష్టరు-ఇంజేడు
332 చీమలమర్రి వెంకట్రామయ్య గారు-టీచరు-కుంచేపల్లె
575 త్యాడరాజ గోపాలరావుగారు-మేనేజరు-P కోనవలస
477 యల్. కృష్ణమూర్తిగారు టీచరు-మేనేజరు-మోనూరు
292 పి ఆదినారాయణగారు-V. M. చిడికాడ
482 కొప్పర్తిసుబ్బారావుగారు-మేనేజరు-పెసర్లంక
337 అమరపు సత్యనారాయణగారు-టీచరు-పాములవలస
234 చక్రపాణి రాఘవరావుగారు- హెడ్మాష్టరు-కొత్తకోట
567 పేర్ల వెంకట్రావుగారు-టీచరు-పాములవలస
439 కణితి రామనాయుడుగారు-టీచరు-ముద్దపువాని పేట

రెండవప్రశ్నకు మాత్రమే

304 కాశీన ఆదినారాయణరావుగారు-గరులియా-పశ్చిమ బెంగాల్
291 అరసాడ జగ్గారావు పట్నాయక్ గారు-మేనేజరు-హెడ్మాష్టరు-త్సలివెంద్రి
134 కవల వీరభద్రుడు గారు-టీచరు- గుడివాడ
108 మిట్టా గంగాధరంశెట్టి గారు-టీచరు-నల్లచెరువుపల్లె
పి. నైనాచార్యులు గారు-హెడ్మాష్టరు-వైకుంఠలక్ష్మీపురం
రెడ్డి సూరినాయుడుగారు టీచరు మానేజరు మోదుగువలస
420 అల్లూరి అప్పలరాజు గారు-టీచరు-ముత్యాలపల్లి
**Mr. B. John** సెక్రటరీ **T. A** సెంటరు కోరాయపాలెం
96. **R.** సుబ్రహ్మణ్యముగారు-టీచరు గంగలకుర్తి అగ్రహారం




## సంక్రాంతిపండుగ

మన ప్రాచీన ఋషిపుంగవులు ప్రజా సముదాయానికి మంచిమార్గముల నలవడ జేయుటకై కల్పించిన సాధనాలు అతి విచిత్రమ్ములు. ధర్మాచరణమునకు - శీల పోషణమునకు-భగవదారాధనాభిలాషకు - ఆరోగ్యాభివృద్ధికి-సుఖజీవయాత్రకు- సంఘాభ్యుదయానికి - ఆచారవ్యవహారముల పేరున వారు విధించిన కట్టుబాట్లు చాలగొప్పవి. నోములు - వ్రతాలు - తీర్థయాత్రలు - మున్నగువాని మూలాన దానశీలాదులందు ప్రథమశిక్షగఱపినారు. నిత్యనైమిత్తికాదుల మూలాన ధర్మవిధుల వ్యాజమున-మానవునకు క్రమబద్ధమైన,ధర్మయుక్తమైన,న్యాయవర్తనమును అలవఱచినారు. ఆచారవ్యవహారముల పేరున చంచల హృదయుడైన మానవుని నియమబద్ధునిగానొనర్చి,ఆరోగ్య విధులం బాటించువానిగాం జేసినారు. దేశీయాభిమానము-జాతీయభావము-ఆనందము ఉత్సాహము-కళారాధనము- ప్రకృతిలక్ష్మీ సముపాసనము - ఈశ్వరమహిమానుభూతి- మున్నగునవియన్నియుం గలుగుటకై పండుగలని-పబ్బములని-కొన్నినియమము లేర్పఱచినారు. మనపూర్వులు ఏమినిబంధించినా దానికి మతవాసన కల్పించినారు. దానికి బలకరముగా పాపభీతిని, దైవభీతిని,జోడించినారు. ఈజోడింపువల్లనే మనముప్రతిస్వల్ప విషయాన్ని పవిత్రదృష్టితో చూస్తాము. పాపభీతితో ఆచరిస్తాము. పాపభీతి అనేది భారతీయులకు ఉగ్గుబాలతో అలవడిన గుణము. సామాన్యములైన ఆచార వ్యవహారలలో క్రమాన్ని తప్పిచరించటానికి మనం వెనుకంగ వేస్తాము. ఇందుకు మూలకారణం "క్రమంతప్పిచరిస్తే పాపం" అని మనము తలంచుటే. ఈలాటి పాపభీతి మనలోపాతుకొని పోవుటవల్లనే ఆగర్భశత్రువునుగూడా మనంమన్నించి, ప్రేమించి, రక్షించగలుగుతున్నాము. ఈగుణమే లేకపోయిన మన దేశచరిత్ర ఏలా మారిపోయేదో మనం ఊహించలేము.

మనపూర్వులేర్పఱచిన ధర్మనిబంధనాలలో మానవాభ్యుదయానికి కావలసిన ముఖ్య సూత్రాలన్నీ ఇమిడి వున్నాయి. ఆచారము పేరున మనముచేసే ప్రతిచిన్న పనిలోను ఆరోగ్యవిషయములెన్నో దాగివున్నవి. పుణ్యంకొఱకు మనము చేసే తీర్థయాత్రలలో మనకు కావలసిన దేశజ్ఞానం, ప్రకృతివిజ్ఞానం,ఎంతో గర్భితమైవుంది. ఈ నిగూఢరహస్యాన్ని గుర్తించలేకనో, గుర్తించినప్పటికీ దానిపట్ల లక్ష్యంలేకనో, నేటినవనాగరికులు ఈయాచార సంప్రదాయాన్ని మూఢవిశ్వాసంగా తృణీకరిస్తూ విస్మరిస్తున్నారు. ఇందువల్ల మనదేశీయత-జాతీయత కళావిశిష్టత-సంస్కృతి-మున్నగునవి యన్నీ

అడుగంటి పోతున్నవి. ఇవియడుగంటిననాడు ఏజాతికూడా పురోభివృద్ధి గాంచలేదనుట నిర్వివాదాంశము.

మచ్చుకు దేశీయములైన మనపండుగలను తీసుకొందము. సంవత్సరము పొడుగునా మనకెన్నో పండుగలున్నవి. మతదృష్టితో చూస్తే మనకు ప్రతిదినమూ పండుగే. కాని అన్నీ ఆచరించుట ప్రజానీకానికి కష్టమని, మనపూర్వులు కొన్నిముఖ్యమైనవాటిని ఏరి, తప్పక ఆచరింపవలసినవిగా శాసించినారు. ఈపండుగలన్నింటిలోను మతసంబంధమైన, ధర్మసంబంధమైన ప్రాశస్త్యమేగాక — సాంఘికసంబంధములైన కళాపోషణాదికములు, ఆరోగ్యప్రవర్తనాదికములు, ఆనందోత్సాహాలు, మిళితములైవున్నవి. అందుకనే యివి నేటివఱకూ ఆచరింపబడుచున్నవి.

ముఖ్యములైన ఇట్టిపండుగలలో సంక్రాంతి పండుగయొకటి. 'సంక్రాంతి' అను శబ్దార్థమునుబట్టి "సంక్రమణము" అనిచెప్పవలెను. ఇందు 'సం' అనునది ఉపసర్గ క్రాంతి అనగా 'క్రమణము = అడుగిడుట' మేషాది రాసులలో సూర్యుడు సంచారక్రమమునుబట్టి ప్రవేశించుట సంవత్సరము పొడుగునా అన్నిరాసులలోను సూర్యుడు ప్రవేశించుచున్నప్పటికి కర్కాటకసంక్రమణము—మకర సంక్రమణము' అనునవి మాత్రమే మహాపర్వదినములుగా పేర్కొనబడినవి. వీనికి ఈ ప్రశస్తిఅయనములనుబట్టి వచ్చినది. కర్కాటకసంక్రమణము దక్షిణాయనమునకు ఆది. మకరసంక్రమణముఉత్తరాయణమునకుఆది. నైష్ఠికులకు, కర్మిష్ఠులకు, ఈరెండు సంక్రమణములు పుణ్యప్రదములైన పైతృకదినములు. ఈ పుణ్యకాలములందుపితృదేవతా ప్రీతికరముగా దానధర్మాదులు చేయుచుందురు. అయితేదక్షిణాయన పుణ్యకాలముకంటె ఉత్తరాయణ పుణ్యకాలమునకే యెక్కువప్రాధాన్యమొసగబడినది. ఎందువల్లనంటే కర్కాటక సంక్రమణమప్పుడు భూదేవి కళావిహీనముగా వుంటుంది. మకర సంక్రమణమప్పుడు పైరుపచ్చలతో కళకళలాడుతూవుంటుంది. అదిగాక రైతులకు ఇప్పుడు విశ్రాంతిలభిస్తుంది. ధాన్యలక్ష్మి, ధనలక్ష్మి, వారియిండ్లలో నాట్యముచేస్తూవుంటవి. సంవత్సరము పొడుగునా వారు కష్టించినఫలము అనుభవానికివస్తుంది. అందువల్ల ఒకరికింతపెట్టుటకు కాని, వేడుకలు చేసుకోటానికిగాని, దానధర్మాలు చేయుటకుగాని. వారికి తగినంత ఉత్సాహం కలుగుతుంది. ఈవిషయాలన్నీ దూరదృష్టితో గమనించి మనపూర్వులు సంక్రాంతి పండుగకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చారు. ఇది నెలరోజుల పండుగ కనుక పండుగలన్నింటిలోకి పెద్దపండుగఅనిచెప్పవచ్చును.

ధనుర్మాసము నెలరోజులూ ప్రకృతిలక్ష్మితోబాటు, ప్రతిగృహలక్ష్మి కళకళలాడుతూ వుంటుంది. ఈపండుగ దినాల వైభవాలు పట్టణాలలో తక్కువకాని పల్లెపట్టులలో కన్నులపండువుగా వుంటవి. తెల్లవారుసరికి ప్రతియింటిముందు రకరకాలరంగవల్లికలు, బాలికలు గొబ్బితట్టుచూ గొబ్బిపాటలపాడుతారు. చిన్నపిల్లలు గొబ్బెమ్మలుపెట్టి పూలు, పసుపుకుంకుమములతో అలంకరిస్తారు. సాతానిజియ్యరు అక్షయపాత్రనెత్తిన పెట్టుకొని, మెడనిండ బంతిపూలదండలు వేసుకొని, పాటలుపాడుకొంటూ వీధివీధికీవస్తాడు. చంటిబిడ్డల చంకనిడుకొని తల్లులు, హారికంఠములు కట్టుకొని

బాలబాలికలూ, అతనికి గింజలు పెడతారు. జంగాలు శంఖాలుపూరిస్తూ సంక్రాంతి భిక్షులకు వస్తారు. గంగిరెద్దులవారు, పగటి వేషాలవారు, నెమిలిపింఛాల చెంచులు, ఎన్నోరకాలవారు యాచనకు వస్తారు. ఎంత మంది వచ్చినప్పటికీ ధాన్యలక్ష్మితో తుల దూగుచున్నరైతు లేదనడు. తనసంపదను వారికిగూడ పంచి ఆనందముతో అనుభ విస్తాడు. పండుగదినములు దగ్గఱపడేకొద్దీ గృహిణులు సున్నపుబెడంగులతో, ఎఱ్ఱ మన్ను పట్టెలతో, గృహాలను శోభాయ మానంగా అలంకరిస్తారు. ప్రతియింటిలోను కళాదేవత తాండవిస్తూవుంటుంది. ప్రతి వాని మొగంలోను ఆనందోత్సాహాలు పొంగి పొర్లుతూ వుంటాయి. క్రొత్తఅల్లుళ్ళు, కూతుళ్ళు వస్తారు. రకరకాలపిండివంటలతో వంటశాలలు ఘుమాయిస్తూ వుంటవి. చాకళ్ళకు, మంగళ్ళకు, దర్జీవాళ్ళకు తీరు బాటేవుండదు. ఈ విధంగా సంక్రాంతి వైభవాలు మిన్ను ముట్టుతవి. పండుగ దినాలల్లో రైతులు పశువులనుగూడఅలంక రించి వూరేగిస్తారు. వారి కష్టంలో అవి గూడ భాగస్వాములు గనుక వాటికిగూడ పండుగే. వినోదంకోసం గ్రామీణులు కోడిపందెములు వేస్తారు. ఎన్నోవిధాల ఆనందిస్తారు. ప్రతి గ్రామం కలియుగ వైకుంఠంలాగా మెఱిసిపోతుంటుంది. ఇంత వుత్సాహం, ఇంత ఆనందం, ఇంతవైభవం మఱేపండుగరోజులలోనూ చూడము. ఇది అందఱికీ విశ్రాంతి సమయం.

సంక్రాంతి పండుగను బొమ్మలపండుగ అని కూడా అంటారు. అనగా పండుగ దినాలలో సాధారణంగా సిరిగలవాళ్ళు తమ గృహాలలో తమ బిడ్డలచేతబొమ్మలు పెట్టిస్తారు. ఇది వినోదంకోసం, వేడుకకొఱకు చేసినప్పటికీ ఇందులో కళారాధన అనే సత్యం గర్భితమైవుంది. పూర్వకాలంలో ఈ కళావైభవాన్ని దిద్దితీర్చుటకు శిల్పులు నియోగింపబడేవారు. వారికి కావలసినంత పోషణలభించేది. జీవకళ ఉట్టిపడే బొమ్మలు తయారుచేసి యీ శిల్పులు తమ కళా ప్రావీణ్యాన్ని ప్రదర్శించేవారు. రకరకాల బొమ్మలతో గృహాలను అలంకరించుటలో కళాపోషణమేగాక పరమేశ్వర మహిమానుభూతిగూడ ఇందు దాగియున్నది. విశ్వ ప్రకృతిలోని సర్వవస్తువులు సుందర స్వరూపుడైన యీశ్వరుని కళామయములు. ఈ బొమ్మలుగూడభగవంతునికళామయములే. అట్టి భావముతోనేకాబోలు. ఈబొమ్మలకు పండుగదినములలో నిత్యనైవేద్యదీపారాధన లిత్తురు. బాలికలు, స్త్రీలు, పేరంటము నకు వచ్చి పాటలు పాడుదురు. కర్పూర హారతులు వెలిగింతురు. అన్ని భోగములు చేయుదురు. దీనినిబట్టి కళారాధనముతో బాటు భగవదారాధనముగూడ జరుగు చున్నది. ఈ విశిష్ట సంప్రదాయమును నేటి నవనాగరికులు మెచ్చకనో, గ్రహింప లేకనో, సౌందర్యశోభలేని యంత్రపు బొమ్మలతో మొక్కుబడి తీర్చినట్లు గృహ ముల నలంకరిస్తూ కళాపోషణమును, దానితో పాటు భగవదారాధనమును, చాలవఱకు భగ్నము చేయుచున్నారు. సాంఘికముగా శిల్పుల జీవనోపాధికి ఇది పెద్దదెబ్బ. జాతీయ ముగా కళాహైన్యమునకు రాచబాట. రసజ్ఞులీ సత్యమును గ్రహించి కళారాధ నకు, పోషణకు, పూనుకొందురుగాక !

పౌరాణికముగా మకర సంక్రమణము నకు ఎంతోగాధకలదు. సంక్రాంతి పురుష

# మీగోచార భావఫలాలు.

V. S. SURU

## 15-1-1952 మొదలు 14-2-1952 వరకు

**మేషం**—ఆదాయ వ్యయసమత్వము ధనప్రాప్తి - కించిత్ మనోవ్యాధి చోరభయము బంధుప్రాప్తి - దైవతోపాసన

**వృషభం**—కార్యవిలంబము. అత్యాశ-కార్య కరణము పరాభవము, చింత, ఊహాగానము.

**మిథునం**—దైవచింత, లాభప్రాప్తి సూచనలు. ఆదాయము, ఆప్తబంధుమిత్ర సమాగమము, సంఘగౌరవము. అధికారి ఆదరణ, కవితాగోష్ఠి, పుణ్యకావ్య పఠనము; రచనము

**కర్కాటకం**—ద్రవ్యనష్టము, పరాజయము, గృహకలహము. పర్యటనము. శూరత్వము హఠాత్తుధనప్రాప్తి తద్వ్యయము

**సింహం**—పరాభవసూచనలు వైరాగ్యము, ప్రయాణము ధనసంపాదనాలోచనలు, హఠాత్తుధనప్రాప్తి, శూరత్వము, మాంద్యము, ఆడంబరవ్యయములు, బంధుమిత్ర సమాగమము.

**కన్య**—మనోదుఃఖము, సదాయానసూచనలు, మితిలేని ధనవ్యయము, పరాజయము, చోరభయం

**తుల**—ఉచ్ఛస్థితి సూచనలు, ధనవస్తు వస్త్రప్రాప్తి, ఆడంబరసహిత ద్రవ్యవ్యయములు ఆప్తబంధుపీడ దైవతోపాస్తి, తచ్ఛాంతి,

**వృశ్చికం**—లాభాదాయ సమత్వము, పురోభివృద్ధి సూచన, దైవచింతన, హఠాద్ధనప్రాప్తి,

**ధనుస్సు**—మానసికాందోళనము, చోరభీతి, పెద్దల యవమానించుట, కార్యవిలంబము అధికారి ధిక్కారము, తన్నిమిత్త మనోవ్యథ

**మకరం**—ప్రయాణం బంధుమిత్ర సమాగమము, వస్తు, వస్త్ర, అలంకారప్రాప్తి, కుటుంబసౌఖ్యము, విక్రమము

**కుంభం**—మోక్షచింత, ధనప్రాప్తి, మిత్రలాభం శరీరాయాసము, దూరప్రయాణం.

**మీనం**—దేశత్యాగము, భార్యానందము, బహుమానము, బంధునిమిత్తధనవ్యయములు

(మీ జాతకమందలి గ్రహచాలనము ననుసరించి గోచార భావఫలములు పరిణామముగా జరుగుచుండును)

నాడీగ్రహచారగణిత రీత్యాయీమాసమందు ధరవరలు హెచ్చుగనగును, ప్రజలకు పరస్పర కలహములు, కొట్లాటలు, పరాజయ సూచనలు, దండ ఖడ్గాయుధ మరణములు జరుగును

☞ సిద్ధయోగినీ, నాడీజ్యోతిష శాస్త్రరీత్యా జాతక, ముహూర్త, వాస్తుప్రశ్న విషయములు, గ్రహపీడాది సర్వబాధలకు చికిత్సలు, మళయాళ మహాకాళీకుట్టీ యామిళయోగినీ-కవచయంత్రరాజములు, సరసముగా తెలుపబడును.

వలయువారు నిలయముపేర వ్రాయవలెను.

**దైవజ్ఞభూషణ, భిషగ్రత్న, పండిత డి. యస్. యన్. శాస్త్రి,**

పవరుపేట-ఏలూరు. (పశ్చిమగోదావరిజిల్లా)

---

౨౮౬ వ పేజీ తరువాయి

లక్షణములు, వాహనాదికములు, వానివల్ల కలిగే మంచిచెడ్డలు మొదలైనవన్నీ మన పంచాంగములలో ప్రతిసంవత్సరము చెప్పబడుచుండును. ఆవిషయాలు వానిని చూచి తెలిసికొనగోరెదను.

—సంపాదకుడు.




## భీమవరం

భీమవరంతాలూకా ఎయిడెడ్ టీచర్సు యూనియను వర్కింగు కమిటీ మీటింగు శ్రీ యస్. సుందరరావు గారి అధ్యక్షతను 8-12-51 వ తేదిని భీమవరం యు యల్ సి, యమ్ చర్చిస్కూలునందు సమావేశమై ఈదిగువ తీర్మానములు గావించబడెను.

1. శ్రీ యస్. సుందరరావు అధ్యక్షులు
2. శ్రీ టి సుబ్బారావు ఉపాధ్యక్షులు
3 శ్రీ ఎ. రామమూర్తి-కార్యదర్శి
4 శ్రీ పి. మోజెస్, శ్రీ జి అబ్రహామ్‌గార్లను, సహాయకార్యదర్శులుగాను, ఏకగ్రీవముగా ఎన్నుకొనిరి

2. ది 5-5-51 నుంచి 8-12-51 వరకు అయినఖర్చులు రు 2-5-9లు ఆమోదించబడెను

3 ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూల్సుయొక్క రివ్యూకాపీలు అందరిమేనేజర్లకు కూడాపంపించవలసినదిగా శ్రీ డిప్యూటీయినస్పెక్టర్లను కోరుచూ తీర్మానించడమైనది.

4 అన్నిమేనేజిమెంట్సులోని, ఒకేఅర్హతగలఉపాధ్యాయులకు జీతములలోగల వ్యత్యాసమునురద్దుచేయించి సమానము చేయించగలందులకు శ్రీ ప్రభుత్వమువారినికోరుచూ తీర్మానించడమైనది

5 ప్రతినెలాయిచ్చుగ్రాంటు బిల్సుపై శ్రీజిల్లావిద్యాశాఖాధికారి సంతకములు 8, 9 తేదీలు అయివుండగా, ఆబిల్సు మేనేజర్లకు 24 25 తేదీలకు గాని అంగుటలేదు కావున ఈయూనియనువారు టీచింగు గ్రాంటుబిల్లులను సాధ్యమైనంత త్వరలోఅందునట్లు చూడవలసినదిగా శ్రీజిల్లావిద్యాశాఖాధికారిగారిని కోరుచూతీర్మానించడమైనది

6 ప్రతినెలా ఎయిడెడ్‌స్కూళ్ళకు యిచ్చు నెలవారీ గ్రాంట్సు నవంబరు, డిశంబరు రెండునెలలు ఆపుటకు ఆవశ్యకత కనుపించదు ప్రతినెలా యిచ్చుగ్రాంటులు సరిగామగింపుచేసి యిచ్చుచున్నారు. కావున అభివృద్ధిలోనున్న స్కూళ్ళకు నవంబరు నెలగ్రాంటు జనవరిలో యిచ్చుఏర్పాటు చేయించగలందులకు శ్రీప్రభుత్వమువారిని కోరుచూ తీర్మానించడమైనది.

7 కంపల్సరీ ఏరియాలో 200కుపైబడి రోలుసంఖ్య ఉన్నచో బోర్డుఎలిమెంటరీ పాఠశాలలకు గవర్నమెంటుఖర్చుతో ఒకజవానును నియమించుటకు అంగీకరించియున్నారు ఎయిడెడ్‌పాఠశాలలు ఎంతతృప్తికరముగా పనిచేయుచున్నను ఈ పైసౌకర్యమును ఎయిడెడ్‌పాఠశాలలకు కలుగచేయుటలేదు కావున ఈ యూనియనువారు కంపల్సరీ ఏరియాలలో 200మించి రోలుసంఖ్యగల ప్రతిఎయిడెడ్‌పాఠశాలకు ఒక ప్యూనును నియమించుకొనుటకు అనుమతించవలసినదిగా శ్రీ ప్రభుత్వమువారిని కోరుచూ తీర్మానించడమైనది

8 ప్రతిహయ్యరు, సెకండరీగ్రేడు ఉపాధ్యాయులకు మేనేజిమెంటువారు రు 3-0-0లు యివ్వవలెనన్ననిబంధనను రద్దుపరచుచూ, ఆఖర్చును ప్రభుత్వమే భరించి ఉపాధ్యాయులకు న్యాయము ఒనగూర్చవలసినదిగా శ్రీప్రభుత్వమువారిని కోరుచూ తీర్మానించడమైనది.

9 ప్రావిడెంటు ఫండు ఉపాధ్యాయుడు ఎంతకట్టుచున్నాడో, అంతా ప్రభుత్వముకూడా భరించవలసినదిగా శ్రీప్రభుత్వమువారిని కోరుచూతీర్మానించడమైనది.

పై తీర్మానములన్నియు ఏకగ్రీవముగా ఆమోదించడమైనది.

**A. Ramamurty**
**Secretary**

## వయోజనులను విద్యా విజ్ఞానవంతులుగా చేయుట మనయందలి విధి.

## రామేశ్వరంలో శ్రీ గాడిచెర్లవారి ఉద్బోధ.

## ప్రొద్దుటూరు

1-12-51 తేదీన రామేశ్వరంలో బాపూజీ వయోజన విద్యాలయ ప్రారంభోత్సవ సందర్భములో ఏర్పాటు చేయబడిన బహిరంగసభకు శ్రీ సుబ్రహ్మణ్యం, బి ఎ యల్. టి గారు అధ్యక్షతవహించారు. ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ సి వెంకటనరసయ్య, స్కూళ్ళ డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ సభ్యులకు స్వాగతం చెప్పారు వయోజనవిద్య ఆర్గనైజర్ శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఉపన్యసిస్తూ "నూటికి ఎనభై మందికి పైగానున్న నిరక్షరాస్యుల మూలాన వ్యవసాయం, పరిశ్రమలు, వ్యాపారం, అన్నీ దెబ్బతింటున్నాయనియు, వారి దారిద్ర్యానికి "కర్మ" కారణమనే మూఢనమ్మకములను పారద్రోలి, వారు మానవులేయని నిరూపించేటట్లుగా వారిని విజ్ఞానవంతులుగా తయారుచేయడం, విద్యావంతుల బాధ్యతయనియు, బ్రహ్మాండముగా జరుగనున్న ఎన్నికలలో విచక్షణాయుతంగా ఓట్లు యివ్వాలంటే వారిలో విద్యాభివృద్ధి అవసరమనియు, వయోజన విద్యాప్రచారాన్ని ప్రజోద్యమముగా చేయాలనియు, చెప్పిరి.

జిల్లా ఉపాధ్యాయ కార్యదర్శి శ్రీ విజయరామరాజుగారు వయోజనవిద్య గఱపే ఉపాధ్యాయులకు వేతనం పెంచాలనీ, వారికి పగటిపనిలో ఒక పీరియడ్ విశ్రాంతి యివ్వాలనీ ఉపన్యసించిరి

స్థానిక గరల్ హైస్కూలు తెలుగు పండిట్ శ్రీ నరసారెడ్డిగారు, గవర్నమెంటు వయోజన విద్యాప్రచారకులు శ్రీ నాగేశ్వరరావుగారు వయోజనవిద్య, దాని ఆవశ్యకతనుగురించి విపులముగా చెప్పిరి. అధ్యక్షుల తుదిపలుకులైన తర్వాత శ్రీ యం సి వెంకటరెడ్డిగారి అభివందనములతో సభముగించబడెను.

శ్రీ నాగేశ్వరరావుగారు తిరిగి జనవరిలో ఈగ్రామమునకు వచ్చి వయోజనవిద్యా ప్రచారఫిల్మును చూపిస్తామని వాగ్దానమిచ్చిరి

## తణుకు ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూళ్ళ సెంటరు క్లాసు వార్షికోత్సవము.—

ది 8-12-51 వ తేదీని కేంద్ర సంఘవార్షికోత్సవం తణుకు వెస్టు రేంజీ స్కూళ్ళ సీనియరు డిప్యూటీ ఇనస్పెక్టరు శ్రీయుత విద్వాన్ సూరాబత్తుల సుబ్రహ్మణ్యంగారు యం. ఏ. యల్. టి. వారి అగ్రాసనాధిపత్యమున కేంద్రపాఠశాలలో జరిగినది. తణుకు యీస్టు రేంజి సీనియరు డిప్యూటీ యినస్పెక్టరు, శ్రీమతి కె. సుబ్బలక్ష్మి బి. ఏ. ఎల్. టి. గారిచే ప్రారంభోపన్యాసము చేయబడినది. సెంటరు ఉపాధ్యాయులచే తయారైన బోధనోపకరణముల ప్రదర్శనమును, అటెండెన్సు ఆఫీసరు శ్రీ కె. సూర్యనారాయణరావుగారు తెరచిరి. కేంద్రదేశికమండలివారి కార్యదీక్షకు ప్రదర్శించిన కళానైపుణ్యమునకు అధికారులు మెచ్చుకొని, ఉత్తీర్ణులైనవారికి యోగ్యతాపత్రములు, శ్రీమతి కె. సుబ్బలక్ష్మిగారు సమర్పించిరి. ఉపాధ్యాయులు సంగీతము- కవిత్వము- ఆసనములు- చేతిపనులు- విచిత్రవేషధారణ- నాటక ప్రదర్శనములలో పాల్గొని అధికారుల ఆశీర్వచన

ములు పొందిరి. అగ్రాసనాధిపతులు ప్రతిస్కూలు ప్రతియేట వార్షికోత్సవము విధిగా జరిపి, ఆఫీసుకు తెలియపరచడము ఆ స్కూలు అభ్యుదయానికి మార్గదర్శకమని, ఉపాధ్యాయుల ప్రయోజకత్వములకు ప్రావీణ్యమునకు ప్రశంసించిరి.

సభకు విద్యాశాఖోద్యోగులు, అభిమానులు విచ్చేశారు. కార్యదర్శిగారు సదస్యులకు కృతజ్ఞతలు తెలిపినారు.

తణుకు }
8-12-51 }

పాముర్తి వేంకటనృసింహామూర్తి,
కార్యదర్శి.

## ఏలూరు పశ్చిమరేంజి స్థానికపాఠశాలోపాధ్యాయకేంద్ర సంఘవార్షికోత్సవము

ఏలూరు పవరుపేట రైల్వేస్టేషన్ మ్యునిసిపల్‌హాయ్యర్ ఎలిమెంటరీస్కూలులో ది 1-12-1951 శనివారం మధ్యాహ్నము పశ్చిమగోదావరిజిల్లా విద్యాశాఖాధికారి శ్రీ అయ్యగారి వీర్రాజుపంతులు బి. యే. ఎల్ టి. వారి అధ్యక్షత క్రింద పై వార్షికోత్సవము జరిగినది. చాలమంది పురజనులు. ఈస్టు, వెస్టు రేంజీల ఇన్‌స్పెక్టింగుఆఫీసర్లు ఉపాధ్యాయులు, శ్రీ ఈదర వెంకట్రావుపంతులుగారు, మున్నగు పురప్రముఖులు, సభనలంకరించిరి. 2గం మొ॥ 5గం॥ వరకు కార్యక్రమం ప్రకారం-1, వస్తుప్రదర్శనము 2. అల్పాహారము 3. ఛాయాచిత్రపటముతీయుట 4. మహాజనసభ 5. ఉపన్యాసములు-తీర్మానములు, 6. వినోదములు 7. వేషములు 8. నృత్యములు 9. గాంధీజీ జీవితం-బుర్రకథ (ముగ్గురు చిన్న బాలికలచే) బహుమతులు వగైరా మున్నగునవి అత్యంతవైభవముతో జరుపబడినవి.

**తీర్మానములు :**

1. సెంటరుక్లాసురోజు శనివారం ఉదయం బడిపనిచేయునట్లు లేదా ఆనెలలో ఒకశనివారం పూర్తిగా పనిచేయునట్లుగాని మధ్యాహ్నము సెంటరుక్లాసుకు హాజరగునట్టి ఏర్పాటుతో వేసవిశెలవులు 7వారములు, మే నుండి ప్రారంభించి యిచ్చుచున్న విజయవాడలోని విధముగా యిప్పించమని యీమహాసభవారు కోరిరి.

2. డి. యర్, సెస్. అలవెన్సు పెంపొందించమని, కోరుచున్నారు.

3. ఇంటిఅద్దెల అలవెన్సు వెంటనేవచ్చు ఏర్పాటు గావించమనికోరిరి,

4. స్థానికపాఠశాలోపాధ్యాయులకు ఎలిమెంటరీపాఠశాలలతరఫున శాసన సభలో ఒకవ్యక్తికికూడా విద్యాసంస్థ విషయములలో ప్రాతినిధ్యం యిప్పించుఏర్పాటు చేయించుమని కోరుచున్నారు.

ఇట్లు
కార్యదర్శి దామరాజు శివరామయ్య.

తూంగుండ్రం:—

30-12-51 తేదిన మా కేంద్రోపాధ్యాయ సంఘసమావేశ వార్షికోత్సవము తూంగుండ్రం బోర్డుప్రాథమికోన్నత పాఠశాలలో చిత్తూరు నార్త్ రేంజి శీనియర్ డిప్యూటి యిన్స్పెక్టరు శ్రీ N. కృష్ణస్వామిరావుగారి అధ్యక్షతక్రింద జరుపబడెను. సహదేవమంగలం, తూంగుండ్రం పాఠశాలల బాలబాలికలచే నృత్య నాటకములు జరిపించబడినవి. బాలురచే క్రీడోత్సవము (Play festival) జరిపించడమైనది. వయోజన విద్యనుగూర్చి పలువురుపన్యసించిరి. తదనంతరము అల్పాహారవిందుతోను, ఫోటో తీయుటతోను, సభ జయప్రదముగా ముగిసెను.

K. పాండురంగ పిళ్లై.
సెక్రిటరి.

---

# కావలెను:

విశాఖపట్నంజిల్లా పార్వతీపురం తాలూకా అడ్డాపుశీల ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూలులోపనిచేయుటకు యిద్దరు హైయ్యరుగ్రేడు ప్యాసయిన ఉపాధ్యాయులు కావలెను గవర్నమెంటువారు యిచ్చు ద్రవ్యముగాక రు3-0-0 లు మేనేజరు యిచ్చును అట్లు పనిచేయుటకు అంగీకారమైనచో వారి దరఖాస్తులు 1 మాకున్నూ మరియొకటి సదరు రేంజి యినస్పెక్టరుగార్కిన్నీ ది 25-1-52 లోగా పంపుకోవలెను.

అడ్డాపుశీల,
ది 10—1—52

కె. స్వామి పంతులు.
టీచరుమానేజరు.

---

# కావలెను:

శ్రీకాకుళముజల్లా పార్వతీపురంరేంజి, పార్వతీపురంపోస్టు బాలగుడపగ్రామ హిందూ ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూలునకు ఇద్దరు హాయ్యరుగ్రేడుపొందిన ఉపాధ్యాయులు కావలెను ప్రభుత్వమువారిచ్చు సొమ్ముగాక అదనము రు 3-0-0 లు ఇచ్చుకొందును. గాన పనిచేయువారు ది 30-1-52 లోగా మా పార్వతీపురంరేంజి స్కూల్సడిప్యూటీ యినస్పెక్టరుగారికి ఒక దరఖాస్తున్నూ మాకొక దరఖాస్తును పంపుకోవలెను

బాలగుడప,
పార్వతీపురంరేంజి,
శ్రీకాకుళంజల్లా

మేనేజరు,
హిందూ ఎలిమెంటరీస్కూలు,
బాలగుడప

ANDHRA RASTRA PRARAMBHA VIDYA
Regd. M N. 3766 Vol. 40. - No. 10



Edited by Sri M. Venkata Ratnam Garu, B A, & Printed and Published by Sri E. Venkaiah Garu at his Pattabhirama Press, Eluru.